ఆయుర్వేదాశ్రమ గ్రంథమాల—౧౩.

# దక్షిణభారతము-ఆయుర్వేదప్రచారము.



ఇది

చెన్నపురి ఆయుర్వేదకలాశాల ప్రిన్సిపాలును

అఖిలభారతాయుర్వేద విద్యాపీఠమున కధ్యక్షులునునగు

శ్రీమాన్,

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు,

ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి, ఏ. వి. యస్., వారిచే

అఖిలభారతాష్టమాయుర్వేద మహాసమ్మేళనమున

పూనాలో (26-2-17) నొసగబడిన

యభిభాషణము.

చెన్నపురి:

౧౯౧౭ సం॥

# పీఠిక.

పూనానగరమునందు గడచిన ఫిబ్రవరిమాసమున శ్రీ శ్రీ కొచ్చిమహారాజాగారి యాధిపత్యముక్రింద నడిచిన యఖిలభారతాష్టమాయుర్వేద వైద్యమహాసమ్మేళనమున స్వాగతకారిణీసభవారు వైద్యరత్న పండిత, డి. గోపాలాచార్యులవారిని దక్షిణభారతమందలి యాయుర్వేదప్రచారముంగూర్చి విపులమగు నొకవ్యాసలేఖను సిద్ధముజేయగోరిన శ్రీఆచార్యులవారు అట్టివిషయములను విమర్శించి గీర్వాణవాణియందు వ్రాసి పై మహాసమ్మేళనమున (26-2-17) జదివిరి.

ఈవ్యాసము సభానాథులగు శ్రీకొచ్చిమహారాజులవార్లయొక్కయు సమ్మేళనమువారియొక్కయు స్వాగతకారిణీసభవారియొక్కయు శ్లాఘనబడసినది. దక్షిణభారతమునంగల యాయుర్వేదవ్యాప్తి దెలియనివారలకందరికిని ఈవ్యాసమునురచించి యాచార్యులవారు మార్గదర్శకులైనందుకు మనమందరము కృతజ్ఞులుగా నుండవలెనని శ్రీసభానాయకులు నుడివిరి. పిదప ప్రత్యక్షశారీరాది గ్రంథరచనాధురీణులును ఆంగ్లఆయుర్వేదవైద్యాచార్యులును మహామహోపాధ్యాయ, విద్యానిధి, సరస్వతి, ఆయుర్వేదావతంసేత్యాది బిరుదావళీవిరాజమానులునునగు కవిరాజ గణనాథసేన్ ఎమ్. ఎ. ఎల్. ఎమ్. అండు ఎస్., గార్లు సభానాథునియొక్క యనుజ్ఞననుసరించి శ్రీగోపాలాచార్యులవారికి అభినందనములజేయుచు నిట్లు నుడివిరి:—

"శ్రీగోపాలాచార్యులువారు చిరకాలమునుండియు నాయుర్వేదమునకై జేయుసేవ లోకవిదితము. వారి సర్వస్వమును ఆయుర్వేదమునకై వినియోగించుచున్నారు. వారిచే నెలకొల్పబడిన యాయుర్వేదకలాశాల లోకోత్తరమైనది. దక్షిణభారతమున నాయుర్వేదమును చక్కనిపునాదితో ప్రచారమునకు దెచ్చినదియేగాక చరకాదిగ్రంథముల నాంధ్రమున పరివర్తించి ప్రచారము జేయుచున్నారు, వీరివద్ద యొక దక్షిణభారతమువారలేగాక పంజాబు, బెంగాలు, ఘూర్జరము మొదలగు దేశముల నుండువారలుకూడ విద్యనభ్యసించి వ్యాపకులుగనున్నారు. వీరికి ఆయుర్వేదమున పాండితి మెండనుటయేగాక ఆయుర్వేదైతిహాసికవిషయములయందును పరిశ్రమమధికము. ఆయుర్వేదవాఙ్మయమునుగూర్చిన చరిత్రము నొకటిని నేను వ్రాసియున్నాడనుకాని శ్రీఆచార్యులవారి యభిభాషణమున గనపరచిన వివిధవైద్యగ్రంథముల నామములనుసైతము నేనెన్న

డును వినియుండలేదు. అపూర్వముగు వీరి పరిశోధన మాయుర్వేదమహాసమ్మేళనమునకు చాల మేలు గలిగించును. వీరివిమర్శనములయందు అష్టస్థానపరీక్ష నాడీపరీక్షలచేచేయు రుగ్వినిశ్చయమార్గమును చరకాదిచక్రదత్తుల కాలము వరకును నెవరును సంస్కృతవైద్యగ్రంథకర్తలు వ్రాసియుండలేదనియు, 14 క్రైస్తవాబ్దమునకు వెనుకటివారగు శార్ఙ్గధరాదులు నాడీపరీక్షాదుల వివరించిరనియు, ఆనాడీపరీక్షాదులను వీరికి పూర్వముననే యగస్త్యవైద్యసంప్రదాయమువారు ద్రవిడభాషయందు వ్రాసియున్నారనియును, దీని పౌర్వాపర్యమునుగూర్చి విమర్శించుట యవసరమనియు జూపియున్నారు. ఇది యొక గొప్పవిషయము. ఈవిషయమై యాచార్యులవారు వంద్యులు. దక్షిణభారతాయుర్వేదచరిత్రమును వాఙ్మయమును వైద్యవ్యాపనమునుగూర్చి వారు మనకుపదేశించిన విషయములన్నియు నిదివరకెరింగియుండలేదు. ఇట్టి యాయుర్వేదమునకు జేరిన యపూర్వవిషయములను మనకుబోధించిన శ్రీఆచార్యులవారికి సభాసదులగు మీయందరిపక్షమునను శ్రీసభానాథుల యాజ్ఞనుండి నామనః పూర్వకముగు నభినందనముల నందజేయుచున్నాడ" నని సెలవిచ్చిరి. మరియు శ్రీగణనాథసేన్ గారు ఈవ్యాసమును నాగరాక్షరముల ముద్రించి వైద్యులందరికి నందజేయవలెనని కోరిరి. సమ్మేళనమును పరిసమాప్తిని జేయుసమయమున సభానాయకులగు శ్రీకొచ్చిమహారాజులవారు ప్రత్యేకముగ శ్రీ ఆచార్యులవారి యభిభాషణము లోకోత్తరమైనదనియు, ఆయుర్వేదవైద్యులు వైద్యముపట్ల విమర్శనముల జేయుటకు మార్గదర్శియైనదియనియు కొనియాడుచు నీవ్యాసము సంస్కృతభాషయందేగాక దేశభాషాసామాన్యమునకూడ ముద్రించి వైద్యలోకమునకు ప్రచారము జేయుట యత్యవసరమనియు నుడివిరి. ఈవ్యాసము ననేకులు కోరియుండుటచేతను సభానాయకులగు శ్రీకొచ్చిమహారాజులవారియొక్కయు శ్రీగణనాథసేన్ గారియొక్కయు కోరికలననుసరించియు సంస్కృతభాషలోనుండిన యీవ్యాసమును మున్ముందు మాపాఠకమహాశయులకై యాంధ్రభాషయందు ముద్రించినారము. ప్రకృతము కాగితములు మొదలగు ముద్రణద్రవ్యముల వెలలు ముందుకన్న మూడునాలుగుభాగము లధికమైనను గణింపక పాఠకమహాశయులకై గ్రంథప్రచారము జేయుచున్నారము. పాఠకమహాశయుల నధికముగ ప్రోత్సాహమును గలుగజేయగోరుచున్నారము.

| | |
|---|---|
| చెన్నపురి, | కార్యనిర్వాహకుడు, |
| ఆయుర్వేదాశ్రమం. | ఆయుర్వేదగ్రంథమాలా కార్యాలయము. |

హెచ్. హెచ్. శ్రీ. సర్. మహారాజ రామవర్మ,

జి. సి. యస్. ఐ., జి. సి. ఐ. ఇ., యఫ్. యం. యు.,

ఇత్యాదిబిరుదావళీవిరాజమానులగు కొచ్చిమహారాజువారి యాధిపత్యమున

(26—2—17 దినమున)

అఖిలభారతాష్టమాయుర్వేద వైద్యమహాసమ్మేళమునందు

# వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు,

ఎ. వి. యస్., ఎ. యం. బి. వారిచే జేయబడిన

యభిభాషణము.

# దక్షిణభారతము-ఆయుర్వేదప్రచారము.

సభాధినాథ శ్రీమహారాజమహాశయ!

నియుక్త సోదరీ సోదర వైద్యపుంగవులారా!

దక్షిణభారతమునందలి యాయుర్వేద ప్రచారముం గూర్చి యీ వైద్యమహాసమ్మేళనమున నుపన్యసింప నఖిలభారతాయుర్వేదాష్టమవైద్యసమ్మేళనస్వాగతకారిణీ సభవారు నన్ను నియోగింప భాగ్యముం బడసితిని.

ఇట్టి మహాకార్యమును నిర్వహింప జ్ఞానముచేతను వయస్సుచేతను నాకన్న పూజ్యులగు నాయుర్వేదవైద్యవిద్యావిశారదు లనేకులున్నను నాకీయపూర్వమగు గౌరవమును

గలుగజేసినందుకు స్వాగతకారిణీసభాసదుల కనేకవందన సహస్రములం జేయువాడ.

బహువిషయ విమర్శనలతోఁగూడిన యికార్యము నిట్టి మహోత్సాహసమయమున సమగ్రముగ పరికించి నిర్వహింప సమర్థత నాకు లేదనుసంశయము నన్నధికముగ బాధించుచున్నది. అయినను నేడు స్వాగతకారిణీసభవారి ప్రీతిపూర్వకమగు కోరికననుసరించి నేను సన్నద్ధుడను గాకున్నచో నేయాయుర్వేదమహాసభ నన్నింతకాలమునుండియు నఖిలభారతాయుర్వేద మహాపరిషదమువలన నేర్పరుపంబడిన "ఆయుర్వేద విద్యాపీఠము" నకు జేరిన బాధ్యతలతోఁగూడిన కార్యముల యందు నియోగించెనో అట్టివిద్యాపీఠపరిషదముపట్ల కృతఘ్నుడగు సేవకునిగ నన్ను భావింతురనుభీతిచే నేనాయుర్వేదప్రపంచమున జేయు కార్యములలో నెల్ల నియ్యది ప్రథమకృత్యమని నిశ్చయించి యెట్టకేల కుపన్యసింప గడంగితిని.

త్రికాలవేదులగు మహర్షిపుంగవుల జ్ఞానజ్యోతితోఁగూడిన యాయుర్వేద వైద్యవిద్యాపారంగతులగు మీయందరియొక్క యవ్యాజకరుణచే నేకకాలంబున నిందరి పేరోలగంబున ప్రాణసంరక్షణదక్షమగు నీమహోన్నతాయుర్వేద సేవంజేయుచు "దక్షిణభారతాయుర్వేద ప్రచారముం" గూర్చి నిర్భయముగ నుపన్యసింప నుద్యమించితిని.

సకలవిధారోగ్యభాగ్యంబు లొసగు నా శ్రీయఃపతిని, రోగార్తులను నిజపుత్రులంబోలి యుపచరించు నా వైద్యసోదరులను నాలోపముల మన్నింప ప్రార్థించుచున్నాడను. ఇట్టి యవకాశమును మీరలు నాకొసంగినందుకు నామనఃపూర్వకములగు వందనశతసహస్రంబుల నొసర్చుచున్నాడను.

—॥ దక్షిణదేశవిభాగము. ॥—

దక్షిణభారతమనగ వింధ్యపర్వతమునకు దక్షిణదిశయందుగల దేశమని ప్రసిద్ధము. ప్రకృతోపన్యాసమునకై చెన్న రాజధానిని, దానిని చుట్టుకొనియుండు సింహళద్వీపమును, కేరళమును, కార్నాటికమును, నైజాము హైదరాబాదు రాజ్యమందలి కొంతభాగమును జేర్చి గ్రహించినాడను.

—॥ ఆయుర్వేదము, దానిప్రాచీనత. ॥—

ఆయుర్వేదవైద్యము భారతదేశమున చిరకాలమునుండియు వ్యాపకములోనుండుట లోకవిదితము. అందును దక్షిణభారతమున నాయుర్వేద వైద్యవిద్యావ్యాపనము చిరకాలమునుండి గలదనుటకు పెక్కుదృష్టాంతములుగలవు. ఇయ్యది యితర వైద్యకపద్ధతులకన్నను మిక్కిలి ప్రాచీనమనుట లోకసమ్మతము. ఇప్పటినవీనమార్గముల కనుగొనబడినవనితలచబడు * రక్తచలనము మొదలగు సిద్ధాంతములు చరకాదిగ్రంథముల గలవనుట నవీనము కాదు.

---

* చరకసూత్రస్థానమున 30-వ అధ్యాయము.

విస్మయజనకముగ నిప్పటివారుచేయు శస్త్రచికిత్సలును తత్సాధనములగు యంత్రశస్త్రములును కొన్ని వేలవత్సరములకు పూర్వమువిరచితములగు చరక సుశ్రుతముల కాలమునాటికే కలవనుటకు సందియములేదు. నవీనపాశ్చాత్య చికిత్సాపద్ధతులచే ననివార్యములగు ననేకవ్యాధులను గుదుర్చుటలో విఖ్యాతములైన యౌషధగణములతో కూడినదనుట సర్వజనవిదితము. ఇట్టి యనేకవిషయములతోడంగూడిన యాయుర్వేదమహిమను గూర్చి నేను విస్తరించుటయనవసరము.

వైదికమహాయుగమునుండియు ప్రఖ్యాతివడసి బ్రహ్మదక్ష అశ్వని ధన్వంతర్యాది పరంపరలచే నభివృద్ధినిబొంది వేదచోదితమైన ఆయుర్వేదము భారతదేశమున నుత్తరవిద్యాపీఠ దక్షిణవిద్యాపీఠములచే వ్యాప్తినందినదని ఐతిహాసికులు జెప్పుదురు.

—) చరకవిద్యాపీఠము. (—

పంజాబుదేశమందలి తక్షకశిలయను గ్రామమున క్రైస్తవజన్మమునకు మున్నూరు (300 బి-సి) వత్సరములకు బూర్వమున ఆత్రేయమతానుయాయియగు చరకుడు కాయచికిత్సాప్రధానమైన యష్టాంగవైద్యకవిషయముల ననేకులకు బోధించి వృద్ధిజేసెను. దీనికే చరకవిద్యాపీఠమనిపేరు.

—) సుశ్రుతవిద్యాపీఠము. (—

వారాణసీనగరమున సుశ్రుతుడు క్రైస్తవజననానంతరము నాలవశతాబ్దమున శస్త్రచికిత్సా పద్ధతుల ననేకులకు

బోధించి శల్యతంత్రమును వ్యాప్తినొందించిరి. ఈ విద్యాస్థానమునకే సుశ్రుతవిద్యాపీఠమని పేరు.

—॥ అగస్త్యవిద్యాపీఠము. ॥—

దక్షిణభారతమున నగస్త్యమహర్షిచే నెలకొల్పబడిన విద్యాపీఠమున కగస్త్యవిద్యాపీఠమని పేరు. ఇయ్యది పైరెండు విద్యాపీఠములవలెనే క్రీస్తవజన్మకు పూర్వమా లేక పరమా యని యిప్పటివరకును చరిత్రకారులచే నిశ్చయింపబడినట్లు కనబడదు. పై పేర్కొనిన చరక సుశ్రుత విద్యాపీఠముల బరంపర భారతధరామండలియందేగాక యనేక ఖండములయందును క్రమముగ నభివృద్ధిగాంచెను. ఆవ్యాప్తికి ఇందలి గ్రంథములన్నియు సంస్కృతభాషామయము లగుటయే ముఖ్యకారణము. అగస్త్యవిద్యాపీఠ పరంపరలు పైవానివలెగాక దక్షిణాపథమందలి యేకదేశమగు ద్రవిడదేశమున మాత్రము వ్యాప్తిగాంచెను. ఈసంప్రదాయమందలి గ్రంథజాలమంతయు సర్వదేశవ్యాప్తమగు సంస్కృతభాషయందు లేక చెన్నరాజధానియందలి కొందరిచే వాడబడు ద్రవిడభాషలో వ్రాయబడుటయే యిందుకు ముఖ్యకారణమని యూహింపదగియున్నది.

ఈసంప్రదాయమును గురించిన వివరములను 1913-వ వత్సరము ఏప్రిల్ మాసమున బొంబాయినగరమున నఖిలభారతాయుర్వేద వైద్యమహాసమ్మేళనమున నాయధ్యక్షకాభిభాష

ణమున దెలిపియుంటిని. మరియు నాచే బ్రచురింపంబడు నాయు ర్వేదాశ్రమ గ్రంథమాలయందు 5-వగుచ్ఛముగు "అగస్త్య సంప్రదాయము" అను చిన్నిపుస్తకమున నీ విషయముల వివరించితిని.

అయినను సభాసదులగు నా ప్రియవైద్య సోదరులకీ సంప్రదాయప్రకారమును దెలుపుట కుత్సాహమును గలిగి యున్నాడ.

—॥ అగస్త్యవిద్యాపీఠము దానిచరిత్ర. ॥—

దశరథరాజతనయుండగు శ్రీరామచంద్రులు దక్షిణాప థయాత్రసలుపుటకు పూర్వమే పూజ్యులైన యగస్త్యమహర్షి దక్షిణాపథము నలంకరించిరనుట లోకవిదితము. ఇయ్యది శ్రీరాములయాగమనమున కెంతకాలమునకుపూర్వమో ప్రా యజాలను. రామరావణయుద్ధమున శ్రీరాముని సర్వసైన్యము నకు చికిత్సకుడుగనుండిన సుషేణుడు ప్రసిద్ధుడు. శక్త్యాయుధా ఘాతముచే మూర్ఛనొందిన లక్ష్మణుని సమ్మోహరహితునిగ జే సినవీరి చికిత్సాకుశలత సుప్రసిద్ధము. ఈప్రాంతముల నాయు ర్వేదప్రచారమున కిట్టిదృష్టాంతములు పెక్కులు గలవు.

—॥ సంప్రదాయప్రవర్తకులు. ॥—

ఈసంప్రదాయ ప్రవర్తకులు నలుపదినలుగు (**44**) రని కొందరును మరికొందరు యిరువదియిద్దరు (**22**) రనియు ఇంక కొందరు పదునెనమండ్రుగు(**18**)రనియువచించెదరు పైమూడు

మతములలో పదునెనమండ్రుగురను మతమే సర్వజనాంగీకృతము. ఈసంప్రదాయప్రవర్తకుల నందరిని ప్రాయికముగ సిద్ధులని వ్యవహరించుట వాడుకయైయున్నది.

—( సంప్రదాయపరంపర. )—

ఈసంప్రదాయమును ఈశ్వరుడు పార్వతికిని, పార్వతి నందీశునకును, నందీశుం డశ్వినీదేవతలకును, వారలు ధన్వంతరికిని, ధన్వంతరి యగస్త్యులకును, అగస్త్యులు పులస్త్యులకును, వారలు తేరయ్యార్ కును, వీరు ఊహామునికిని క్రమముగ నుపదేశించినట్లు ఇందలిగ్రంథములనుండి తెలియుచున్నది.

ఈ సంప్రదాయ ప్రవర్తకులగు సిద్ధు లిరుదెరంగులు. అందు సంస్కృతభాషావైదుష్యముతో కూడిన వైద్యపాండిత్యముగలవారికి వడ (ఉత్తర) సంప్రదాయజ్ఞులనియు కేవల ద్రవిడభాషావైద్యపాండిత్యని బడసినవారికి తెక్క (దక్షిణ) సంప్రదాయజ్ఞులనియు వాడుక.

ఇందు మొదటివారగు నగస్త్యులు తేరయ్యార్ భోగర్ పులిప్పాణి మొదలగువారు సంస్కృతభాషయందును ద్రవిడభాషయందును స్వతంత్రవైద్యగ్రంథరచనల సలిపిరి. మరియు కొన్నిటికి సంస్కృతమునుండి ద్రవిడభాషలో పరివర్తన మొనరించిరి. రెండవతెగవార లధికముగ ద్రవిడభాషయందే వైద్యగ్రంథముల రచించిరి.

ఈరెంటియందును రసతంత్రప్రక్రియలు మెండు. ఈప్ర క్రియలును వానివిభాగములును జారణమారణా ద్యుపాయము లును ప్రక్రియలును పరిభాషలును ప్రాయికముగ సంస్కృత భాషామయములగు నాగార్జునాది రసతంత్రములయందలి ప్ర క్రియలకన్న భిన్నములుగ దెలియుచున్నవి.

—( ఖనిజపదార్థములును, వాని విభాగములును. )—

ఈసంప్రదాయమున మైలతుత్తమునైనను సౌవీరము నైనను భస్మమునుజేసి దానినే ప్రతిపదార్థమును భస్మ మును జేయునపుడు మూలప్రకృతివలె సహాయముగ జేర్చె దరు. ఈ భస్మమునే గురుభస్మమందురు. సామాన్యభస్మ మునకన్న గురుభస్మ సహాయమున జేసిన భస్మము వేయిను ఱుంగులు గుణాధికము. ఇట్టి ప్రక్రియ లీ సంప్రదాయమున మెండు. ఇందలి గ్రంథపరిశీలనమునుండియు నీసంప్రదాయ ప్రక్రియ లుపయోగించు ననుభవమునుబట్టియు నాగార్జునాది రసతంత్రముల విహితములగు భస్మసిందూరాదులకన్న నీ యు స్త్యసంప్రదాయ బోధితములగు భస్మసిందూరాదులును •సిని జేయు ప్రక్రియాదులును సులభములనియు ఉపయో గమున గుణాధికములనియు నాయభిమతము. ఇయ్యది విజ్ఞు లకును విదితము.

మరియు ప్రత్యేకము దక్షిణాపథమందు ప్రసిద్ధిగాంచిన యనేకమూలికల గుణములు జెప్పబడినవి. ఈ మూలికాద్రి

పదార్థములకు రసము, వీర్యము, విపాకము, ప్రభావము, గుణము, దీపనము, పాచనము, రసాయనము ననెడు సంప్రదాయముల ననుసరింపక కేవలము ప్రభావరూపగుణములే జెప్పబడియున్నవి. ఇందు చరకసుశ్రుత వాగ్భటాదులయందు జెప్పంబడని శివనారివేంబు, కుప్పమేని, పూవరశం మొదలగు పెక్కుమూలికలు గలవు.

—( ద్రవిడవైద్య వాఙ్మయము. )—

పైఁ బేర్కొనబడిన పదునెనిమిది సిద్ధులును ఈ సంప్రదాయబోధకములగు ననేకగ్రంథముల రచించిరి. వీనిలో కొన్నిటిని ద్రవిడభాషయందు పరివర్తితములుగ జేసినట్లు తేరయ్యర్ తిరుమూలర్ మొదలగువారి గ్రంథములనుండి తెలియుచున్నది. ఈ పరివర్తన మేకాలమున జరిగించబడినదను చారిత్రక విషయములు దుర్ఘటము లగుటచేతను సంప్రదాయ గ్రంథములు విరళప్రచారములగుటచేతను పౌర్వాపర్యముల నిర్ణయించుట దుస్సాధముగనున్నది.

క్రీస్తుశకమున కెన్నియోవందల వత్సరములకు పూర్వము దక్షిణదేశమందు తామ్రపర్ణి మధుర మొదలగు స్థలములలో మూడుతడవలు ద్రవిడసంఘములు నెలకొల్పబడెను. ఆసంఘములయం దనేక శాస్త్రీయ విషయములు విమర్శింపంబడెను. అక్కాలమున ద్రవిడభాషా యోష వేదాన్తవైద్య సంగీత జ్యోతిషాదిశాస్త్రములనలంకరించినదనుట లోకవిదితము. అందు

కడపటి మూడవసంఘముకూడ క్రైస్తవశకమునకు పూర్వ మెంత కాలముక్రింద జరిగియుండెనో ఐతిహాసికులు నిర్ణయింప దుస్సాధముగ నున్నది. ఇట్టి ద్రవిడభాషయందుగల వైద్య సారస్వతము ఇతరదేశ భాషా వైద్యవాఙ్మయమునకన్న ముందటిది యనుట నిర్వివాదము. ఈ వాఙ్మయమున ప్రకృతము ముద్రితములును అముద్రితములునునగు పుస్తకములు దాదాపు నూటయేబది (150) గలవు. లభ్యములుగనున్న వీనిలో గొన్నింటి నిట గనబరచెద.

అగస్త్యర్ పెరుంతిరట్టు
అగస్త్యర్ ఆయుర్వేదభాష్యము
అగస్త్యర్ భస్మమురై, (భస్మాది ప్రక్రియలు)
అగస్త్యర్ నాడినూల్, (నాడీవిషయము)
అగస్త్యర్ ఆయిరత్తెరనూర్
అగస్త్యర్ తొలికాప్యం
అగస్త్యర్ పరిపూర్ణం
పులిప్పాణి ఐనూర్
భోగర్ ఎణ్ణూర్
ఊహాముని ఆయిరం
రోమఋషి ఐనూర్
సరక్కువైప్పు
రామదేవర్ పెరినూల్
గోరక్కర్ వైద్యము (గోరక్షసిద్ధుల వైద్యము)
మత్స్యముని ఎణ్ణూర్
కరువూరార్ తిరట్టు
తేరయ్యర్ కరశల్ మున్నూర్
అగస్త్యర్ పిళ్ళైతమిళ్
శివజాలం
శక్తిజాలం
షణ్ముఖజాలం
కొంకణర్ నిదానం

## —॥ అష్టస్థానపరీక్షావిధానము. ॥—

ఇందు అష్టస్థానపరీక్షలచే రుగ్వినిశ్చయమును దెలుపు గ్రంథములు కొన్నిగలవు. ఇట్టి గ్రంథములయందు బోధితములగు

పరీక్షావిషయములు చరకము, సుశ్రుతము, వాగ్భటము, మాధవనిదానము, చక్రదత్త మొదలగు గ్రంథములయం దేమాత్రమును గనపరచక పోవుటచే నీ రోగపరీక్షావిధానములం దొలుతొలుత గనిపెట్టినది యగస్త్యసంప్రదాయజ్ఞులనుట కవకాశము గలుగుచున్నది.

—॥ నాడీగ్రంథముల ప్రాచుర్యము. ॥—

మరియు నాడీనిదానమును మూత్రపరీక్షాక్రమమును దెలుపునవి ప్రత్యేకగ్రంథములు కొన్ని గలవు. అయ్యవి సంస్కృతముననుండు నాడీనిదానాది గ్రంథములకన్న ప్రాచీనములుగను వాని కాధారభూతములుగను విపులములుగను గన్పట్టుచున్నవి. అట్టి ద్రవిడభాషా గ్రంథములబట్టి నాడీనిదానాదిగ్రంథములు సంస్కృతమున వ్రాయబడియుండునాయను సందేహమును గల్గించుచున్నవి. ఈవిషయమును కూలంకషముగ విమర్శించిన గాని సిద్ధాంతముగ జెప్పజాల.

ఈ సంప్రదాయమునందలి విభాగముల నన్నింటిని వివరించవలెనన్న గ్రంథవిస్తర మగునుగాన స్థాలీపులాకన్యాయముగ నాప్రియవైద్యసోదరులకు కొంతవరకు దెలిపితిని.

—॥ సింహళద్వీపము - ఆయుర్వేదము. ॥—

లంకాద్వీపము (సిలోన్ - లేక కొళంబు). ఈద్వీపమే పూర్వకాలమున దశాస్యుని రాజధానియని ప్రసిద్ధి. దీనినే ప్రకృతము సింహళద్వీప మనియెదరు. ఆనందకందగ్రంథకర్తయగు ప్రసి

ద్ధులగు మంథానభైరవు శ్రీసిహ్మళక్షోణీపాలుని యాస్థానమున విద్వద్వైద్యుడు. రామరావణయుద్ధకాలమున శ్రీ వాయు తనయునిచే హిమాలయప్రాంతమునుండి తేబడిన విశల్యకరణి సంధానకరణి సావర్ణ్యకరణి సంజీవకరణియను నోషధిరత్న ముల నలంకరించినది యీ లంకాద్వీపమే. పై నాలుగు విధ ములగు దివ్యౌషధుల నుపయోగించు పరంపరలలో సంధాన కరణి నుపయోగించు పరంపర యిప్పటికిని యీ లంకాద్వీప మునగలదు. ఎముకలు విరిగినపుడును నలిగినపుడును కుదుర్చు టలో వీరు ఖ్యాతినందినవారు. సామాన్యముగ నెముకలు నలి గినపుడు సంధానమునకై సంధానకరణియను ఆకును పైనవేసి కట్టుదురు. మిలెటరి ఆఫీసు ఐ. యం. యస్., ఆఫీసు గొప్ప దొరలునుకూడ నెముకలు విరిగినపుడు వీరివద్దకే చికిత్సకేగ దరు. పాశ్చాత్య చికిత్సలజేసికొనరు. ఇట్టివి యెన్నియో దివ్య మూలిక లీద్వీపము నలంకరించియున్నవి. ప్రకృత మిచ్చట నాత్రేయాదిచికిత్సలును అగస్త్యసంప్రదాయచికిత్సలును నా టకయందు గలవు.

ఇచ్చటి బుద్ధభిక్షువులు విశేషముగ నాయుర్వేదమున పాండితిని బడసియున్నారు. చరక సుశ్రుత వాగ్భటాదులు పఠనపాఠనములయందుగలవు వీరికి రసతంత్రప్రక్రియలువిశేష ముగ నభ్యాసమున లేవు. ఇచ్చట విద్యోదయ కలాశాలయం దనేకులు బుద్ధులును బుద్ధభిక్షువులును నాయుర్వేదము నభ్యసిం

చుచున్నారు. వీరలు వరరుచివిరచితమగు "యోగశతకమును" కంఠస్థముగనుంచుకొని చికిత్సాచరణము జేయుదురు. ఇచ్చట నాయుర్వేదవైద్యము వ్యాపకములో నున్నదనుటకు అఖిలభారతాయుర్వేద విద్యాపీఠమునకు జేరిన «ఆయుర్వేదాచార్య» పరీక్ష కొకబుద్ధయువకు డీ వత్సరమున ప్రవేశపత్రిక (అప్లికేషన్) బంపియుండుటయే నిదర్శనము.

—॥ లంకాద్వీపము, వైద్యవాఙ్మయము. ॥—

సారార్థసంగ్రహము:—సంస్కృతమూలము సింహళభాషానువాదసహితముగ గలదు. ఇయ్యది స్కంధత్రయాత్మక విషయబోధకము. ఖనిజ, ప్రాణిజ, ఉద్భిజ్జములు జేరిన యోగములును అధికముగ మూలికల ప్రయోగములును ఇందుగలవు. శల్యతంత్రప్రక్రియలును విరళముగ గలవు.

భేషజమంజూష:—ఇయ్యది పాళిభాషామయము. ప్రాచీనుడగు బుద్ధభిక్షువుచే విరచితము. ఇందు మూలికాప్రయోగము లధికములు. రసచికిత్సలును కొంచెముగలవు.

సారసంక్షేపకము:—ఇది సంస్కృతభాషామయము. సింహళభాషాటీకాయుతము. రోగలక్షణచికిత్సాబోధకము.

భేషజకల్పము:—సంస్కృతము. పరిభాషాబోధకము.

యోగశతకము:—సంస్కృత వ్యాఖ్యాయుతము. ఇందలి యోగములు సిద్ధప్రక్రియలబోలియున్నవి. దీని ననుసరించిన చికిత్సలను విశేషముగ వీరుపయోగించెదరు.

సారస్వతనిఘంటువు, సిద్ధౌషధనిఘంటువు:— ఈ రెండును పదార్థగుణములను బోధించునవియైయున్నవి. ఇందు దేశీయములగు మూలికలు కొన్ని చెప్పబడియున్నవి.

యోగరత్నాకరము:— ఇయ్యది గడచిన ఆరువందలవత్సరములపుడు "మయూరపాదభిక్షువు" లను వైద్యశిఖామణిచే విరచితము. ఇం దనుభవసిద్ధములగు నిదానచికిత్సలుగలవు.

పైఁ గనుపరుపంబడినవి మొదలగు ననేక గ్రంథరాజములియ్యెడసంస్కృతభాషయందును సింహళభాషయందునుగలవు.

—( కేరళదేశము - ఆయుర్వేదము. )—

దక్షిణాపథమున కేరళమని ఖ్యాతివహించిన దేశముగలదని తమకందరకును విదితమే. ఆదేశము కొచ్చి తిరువాంకూరు అను రెండు రాజ్యవిభాగములుగల్గి తదధిపతులచే బాలింపబడుచున్నది. ఈమహావైద్యసమ్మేళనమున సభానాయకత్వమును వహించియున్న మహారాజ మహాశయులే కొచ్చి రాజ్యాధిపతులు. కొచ్చిరాజ్యాధిపతులును మనసభానాథులును నగు మహారాజవిద్వచ్చూడామణి సాన్నిధ్యమున కేరళదేశవృత్తాన్తమును మీకునివేదింప నొడలు వణకుచున్నది మాటవెడలక రసనేన్ద్రియము తడబడుచున్నది. అయినను విద్వచ్చక్రవర్తియును భిషక్చూడామణియునగు సభానాయకునియొక్కయు ఆయుర్వేద వైద్యవిద్యావిశారదులగు తమయొక్కయు నిర్హే

తుకజాయమానకటాక్షవీక్షణము నాపై ప్రసరించుటం జేసి నేనీ విషయమును నివేదింప సాహసించినాడ.

కేరళమున నాయుర్వేదప్రచారము మెండుగ నున్నదని సర్వజనవిదితము. ఈదేశమున సామాన్యవైద్యునకుంగూడ అష్టాంగహృదయము కంఠస్థముగనుండును.

కొందరు అష్టాంగహృదయమునకన్న వేరొండు వైద్య గ్రంథము లేదనియు దలంచెదరు. శాస్త్రీయపద్ధతుల నొనరింప బడు స్నేహ స్వేద వమన విరేచనాది శోధనచికిత్సలును తక్రధారాది ధారాకల్పప్రక్రియలును వీరిసొమ్ము. ఈశోధనాదిచికిత్సలు భారతదేశమున వేరొండుచోట వాడుకయందు లేవనుట స్పష్టము.

—: మూలికల యంగడులు. :—

ఈదేశమున వైద్యులలో మందుల కుపయోగింపదగిన మూలికలనమ్మువారు కొందరు గలరు. వారు శుష్కంబులును అర్ద్రంబులునునగు నౌషధములను సిద్ధపరచి యెల్లప్పుడు నంగటిలో నునిచెదరు. వైద్యులు రోగికి శాస్త్రసాంకేతితములగు దశమూల పంచమూల పంచమిత్రాదిగణములను వానివాని భాగభేదముల నిర్ణయించి యొకపట్టికను లిఖించి యిచ్చెదరు. రోగి యాపట్టికను మందులంగడివారికిజూప వారు సాంకేతిత నిర్ణయప్రకార మౌషధముల నిచ్చుటకలదు. మరియు నాదేశ

మున క్షీరబలాది అసనాది ధన్వన్తర్యాది మున్నగు తైలాది యోగముల నుపయోగించు పదార్థములంగోరిన నాయంగడి వారు విధులననుసరించి యాద్రవ్యముల నిచ్చెదరు. ఇట్టిసంప్రదాయము కేరళవ్యతిరిక్తదేశమున గన్పట్టదు.

## —॥ అష్టవైద్యులు. ॥—

మరియు నీదేశమునం దష్టవైద్యులను నెనిమిది వైద్యకుటుంబములవారు గలరు. వీరలు శ్రీపరశురాముని కాలమున శల్యశాలాక్యాద్యష్టాఙ్గముల నుపదేశమునొందిన వైద్యులని వాడుక కలదు. వీరునంబూరీబ్రాహ్మణులు. మిక్కిలి ధనవంతులు. వీరిసంతతు లిప్పటికిని కేరళమునగలవు. అష్టాఙ్గములలో జేరిన యొక్కొకయంగము నొక్కొక రవలంబించి చికిత్స జేయుటచే వీరి కష్టవైద్యులని నామధేయము గలిగెను. వీరు ప్రతిదినసంబును తొలుత ధన్వంతరిపూజసలిపి పిమ్మట రోగులకు చికిత్స జేయగడంగుదురు.

మరియు నందు కోటయంవైఖరీమూసు అనువారు మహాధనవంతులు. వీరు రాజసన్మానముచే నరువదినాల్గు (64) గ్రామముల నొందియున్నారు. వీరి గృహావరణమున ధన్వన్తరి దేవాలయముకలదు. వీరనుదినంబును ప్రాతఃకాలమున ధన్వన్తరిపూజలొనరించియే చికిత్స జేయుదురు.

1909-జనవరిలో కొల్లంగోడు రాజాస్థానమున నాయధ్యక్షకత క్రింద జరిగిన యాయుర్వేదసమాజానుబంధమగు సప్తమ

వైద్యసమ్మేళనమున కేరళదేశమందుగల వైద్యమహానీయులలో కొందఱిని దర్శించుభాగ్యము కలిగినది. ప్రకృతమునందిచ్చట వైద్యరత్న బిరుదాంకితులును ప్రసిద్ధవిద్వద్వైద్యులును నగు శ్రీవైద్యరత్నపరమేశ్వరమూసద్ గారు వైద్యకశిరోమణులగు పెళాంతోళ్ మూసుగారి శిష్యపరంపరకు జేరియున్నారు. వీరిచికిత్సానైపుణ్యము లోకవిదితము. ఈపరంపరల నుండువారును వీరికి జేరినవారును ఇప్పటికిని నేత్రశ్రోత్రాది ప్రత్యేకచికిత్సకులును విషచికిత్సకులునునై యున్నారు.

మన స్వదేశసంస్థానాధిపతుల కార్యవిద్యాలయం దభిమానము మెండనుట లోకవిదితము. కేరళసంస్థానాధిపతులకు ఆర్యవిద్యాలయం దభిమానముమాత్రముగాక వారుస్వయముగ సర్వతన్త్రస్వతన్త్రులుగను విద్వద్వైద్యచూడామణులుగను ఉన్నారనుట శ్రీవైద్యమహాసమ్మేళనమున సభాధిపత్యమును వహించిన మహారాజుగారే దృష్టాన్తము.

మరియు ప్రకృతపు కొచ్చిమహారాజులు మహాపండితులనియు విద్వద్వైద్యులనియు, సప్తమరాజకుమారులును మన ఆయుర్వేదవిద్యాపీఠమున కుపాధ్యక్షులునగు శ్రీరాజా రామవర్మగారువైద్యవైదుష్యముతో గూడిన విషవైద్యమున నైపుణ్యము గలవారనియు మీకు నివేదించుటకు నాకు మిక్కిలి సంతోషము గలుగుచున్నది. ఈ శ్రీరామవర్మరాజుగారు కొన్నిమాసములక్రిందటనే విషవైద్యశాల నారంభించిరనియు మీకందర

కును విదితమయ్యేయున్నది. కొలదిదినములలోపుగనే కొచ్చి రాజ్యమున గొప్పఆతురాలయమును ఆయుర్వేదమహావిద్యాలయమును విద్యార్థివసతిగృహమును నెలకొల్పబోవుచున్నారనిచెప్పుటకును మిక్కిలి సంతస మొప్పుచున్నది. మరియు గడచిన జననరిమాసమున కళ్లికోటపత్తనమున నాప్రియమిత్రులగు శ్రీయుత. పి. యస్. వార్యర్ గారి ముఖ్యప్రేరణనుండి యొక ఆయుర్వేదకలాశాల స్థాపింపబడియున్నది.

—( అనంతశయనరాజ్యము-ఆయుర్వేదము. )—

అనంతశయనరాజ్యమున నీచికిత్సాప్రచారము మెండు. ఈరాజ్యమున గొప్పదియగు నాయుర్వేదమహావిద్యాలయము కలదు. ఇందుత్తమతరగతియందుత్తీర్ణులైనవారు దాదాపు రెండువందల(200) మందిగలరు. ఈరాజ్యమునందంతటను రాజకీయాయుర్వేద వైద్యశాలలు డెబ్బదిరెండు(72)గలవు. ఈవైద్యశాలలుపై జెప్పబడిన రాజకీయవైద్యకలాశాలయందును ఇతర వైద్యకలాశాలలయందును ఉత్తీర్ణులగు విద్వద్వైద్యులచే నిర్వహింపబడుచున్నవి. ఈవైద్యశాలలసంఖ్య ప్రతివత్సరంబునను హెచ్చింపబడుచున్నవి.

ఈ వైద్యశాలలన్నియు "సూప్రంటెంటు ఆఫ్ ఆయుర్వేదవైద్యశాలాన్" అనునొక ఆయుర్వేద వైద్యశాలాధికారి నిరీక్షణముక్రింద దొరతనమువారిచే నుంచబడియున్నవి. ప్రతివత్సరమునను పై వైద్యశాలలకై దొరతనమువారు 1915-16

వత్సరమున 15809 పదునైదువేల యెనిమిదివందలు తొమ్మిది రూపాయిలు వెచ్చించియున్నారు. మరియు పై వైద్యశాలల యందు 1914-15 వత్సరమున 136074 మంది రోగులును, 1915-16 వత్సరమున 143505 మంది రోగులును చికిత్సనందిర నియు 1916 సంవత్సరపు నివేదికనుండి తెలియుచున్నది.

భారతదేశమున, ప్రాయికముగ డెబ్బదిరెండు (72) ఆయుర్వేదవైద్యశాలలను పోషించు స్వదేశసంస్థానము మఱి యొకటిలేదని మీకునివేదింప నెక్కువ సంతోషముగనున్నది. ఈరాజ్యమున పాశ్చాత్యచికిత్సలకై 484479 రూపికముల ద్రవ్యమును వెచ్చించెదరు. ఈద్రవ్యవ్యయముచేత 869563, మంది రోగులకుఁ చికిత్సాసహాయము లభించినది. పైకనబరచిన రెండువిధములగు వైద్యములలో నేచికిత్స సులభంబును అల్ప వ్యయముచే నిర్వాహ్యంబునునై యుండునో విజ్ఞులకే గోచరమ గునుగాన నేను వివరింపనక్కర లేదు.

శ్రీ మహారాజుగారిని ఆయుర్వేదవైద్యము విషయమై యింతకన్న నధికమగు ప్రోత్సాహమును గల్గించుటకును అష్టాంగములతోఁగూడిన ఆయుర్వేద చికిత్సలకును, ప్రత్యేక ప్రత్యేకముగ చికిత్సావిధానముల యవకాశము గల్గించుటకు మిక్కిలి వినయవిధేయుఁడనై ప్రార్థించెదను.

### — కేరళము వైద్యవాఙ్మయము. —

కేరళమున అష్టాంగహృదయమునకన్న వేరొండువైద్య గ్రన్థమునకు, ప్రాబల్యము లేదని తెలిపియుంటిని. దీనికి హృదయ

క్రియయను చక్రపాణివ్యాఖ్యకలదు. ఇయ్యది కేరళభాషయందు పరివర్తనమొనరింపబడినది. అష్టాంగసంగ్రహమునకు, ఇందు టీకయను చక్రపాణి వ్యాఖ్యను ముద్రించియున్నారు. ధారా కల్పము, సహస్రయోగము అనుగ్రంథములు ప్రశస్తములు, ఇచ్చట కొలదికాలమునుండి చరక సుశ్రుతాదులను రసగ్రన్థములనుగూడ ప్రచారమునకు దెచ్చుచున్నారు. వైద్యపుంగవులును నాప్రియమిత్రులునునగు వైద్యనారాయణనాయర్ కొల్లంగోడువారు సుశ్రుతమును కేరళభాషయందు పరివర్తనమొనరించిరి. ఈ ప్రాంత్యముననె చరకమునుకూడ కేరళభాష నలంకరింపజేసిరి.

## —కార్నాటికరాజ్యము, ఆయుర్వేదము.—

కర్నాటక రాజ్యము చిరకాలమునుండియు నార్యవిద్యల కాటపట్టయినదియని ప్రసిద్ధము. నేటికిని యీప్రాచీనాచారమే యిచ్చట వాడుకలోనున్నది. నావిద్యకును ఆయుర్వేదమునకు నేజేసెడు ప్రతిసేవకును నాస్థితికిని జీవికకును ముఖ్యాధారమైన మైసూరునగరమున దొరతనమువారిది గొప్పదయగు నాయుర్వేదకలాశాలగలదు. ఇందనేకులు వైద్యవిద్య నభ్యసించెదరు. దీనికనుబంధముగ ధర్మవైద్యశాలయొకటి కలదు. ఇందు విద్యార్థులకు కర్మపథమును బోధించెదరు. ఇదిగాక యీరాజ్యమున ముప్పదియారు (36) ఆయుర్వేద ధర్మవైద్యశాలలును ఐదు (5) యూనానీ ధర్మవైద్యశాలలును గలవు. వీని

నన్నింటిని వైద్యకలాశాలయందు చదివి పరీక్షలయందుత్తీర్ణులగు విద్వద్వైద్యులు నిర్వహించెదరు. వీనిపోషణమునకై దొరతనమువారు ప్రతివత్సరమున దాదాపు పండ్రెండువేల(12000) రూప్యములను వ్యయము జేయుచున్నారని దెలియుచున్నది. ఈ నలువదిరయొకండు (41) ధర్మవైద్యశాలలయందును 1915 వత్సరమున 314391 రోగులును 1916 వత్సరమున 328763 రు రోగులును చికిత్సనొందియున్నారు. ఈరాజ్యమున నాంగ్లేయ చికిత్సాసాహాయ్యమునకై వత్సరమునకు 452365 రూప్యములు వెచ్చింపఁబడుచున్నవి. స్వదేశ సంస్థానములలోఁగూడ పాశ్చాత్యవైద్యమునకు జేయు సహాయములలో నేకదేశమైనను స్వదేశవైద్యమునకు, కనబడలేదు.

సర్వజనసామాన్యంబును అల్పవ్యయముచే సులభసాధ్యంబునునగు దేశీయవైద్యమును ఇంతకన్న ప్రోత్సాహమును గల్గించి వృద్ధినందించుటకై శ్రీమన్మహారాజుగారిని సవినయముగ ప్రార్థించెద. శ్రీమన్మహారాజుగారు ఆయుర్వేదవైద్యముతో బాటు యునానీవైద్యమునుగూడ పోషించుచున్నందుకు మనమందఱమును వందనసహస్రముల నర్పింపవలసియున్నది.

### — కర్నాటకమున ప్రసిద్ధవైద్యులు. —

ఈరాజ్యమున నంతటను వైదికతాన్త్రిక మిశ్రములను చికిత్సలుమెండు. పూర్వకాలమున జైనులు విశేషఖ్యాతిగల వైద్యులుగనుండిరి. వీరిలో పూజ్యపాదులు, ఉగ్రాదిత్యాచార్యులు, మంగరాజు, అభినవచంద్రుడు, మున్నగువారు ప్రసిద్ధులు.

వీరి పరంపరకు జేరిన సూరిపండితులు చంద్రపండితులు అను సోదరవిద్వద్వైద్యులు స్వర్గీయకృష్ణరాజ ఒడయర్ మహారాజులవారి ఆస్థానవైద్యులలో నగ్రగణ్యులై యుండిరి. వీరి పరంపరకు జేరిన దినచంద్రపండితుల కుటుంబమువారు ఇప్పటికిని వ్యాపకులుగ నున్నారు.

మఱియు నస్మదాచార్య గురుపరంపరాన్తర్ఖ్యాతులగు విద్వద్వైద్యులును ఇతరులగు వైద్యపుంగవులును ఈసంస్థానమున మిక్కిలి ప్రసిద్ధినొందియున్నారు.

—కర్ణాటరాజ్యమున సంస్కృతవైద్యవాఙ్మయము.—

కర్ణాటరాజ్యమునందు దాయుర్వేదీయవైద్యవాఙ్మయము సంస్కృతభాషయందును కర్ణాటకభాషయందును చిరకాలము నుండియు మిక్కిలి యభివృద్ధినొందియున్నదనుటకు అనేకదృష్టాన్తములుగలవు. అందు కొన్నిటి నిచ్చో డజూపెదను.

పూజ్యపాదులు:—వీరిచే విరచితమగు గ్రన్థమునకు పూజ్యపాదీయమని పేరు. వీరు క్రైస్తవ 470 A.D. కాలమునాటివారని ప్రసిద్ధము. మైసూరు రాష్ట్రమునంగల కొళ్లెగాలమను గ్రామమున భూసురకుటుంబమున జన్మించిరి. వీరు కొంతకాలమునకు పిదప జైనమతదీక్ష నవలంబించి వైద్యమంత్రయంత్రాది శాస్త్రములయందు ప్రవీణులైనట్లు 1205-A. D. కాలపు పార్శ్వపండితులనువారు వ్రాసియున్నారు.

ఉగ్రాదిత్యాచార్యులు:—వీరలు 814 ఏ.డి. కాలమున నుండిన రాష్ట్రకూట వంశమునకు జేరిన నృపతుంగమహారాజు గారి యాస్థానమున వైద్యులుగనుండి శ్రీ. శ్రీ. జినునిచే మగధ భాషయందు రచియింపబడిన కల్యాణకారకమను గ్రన్థమును సంస్కృతభాషయందు తానువ్రాయించినట్టులు తనగ్రన్థమున జెప్పి యున్నారు. మరియు వారు నొకసమయమున హస్తిచారి, విశాల, విభండక, వైదర్భనర, కాంకాయన, వాగ్బలి, మృగ శర్మ, సురేన్ద్రప్రముఖులగు వైద్యపుంగవులచే నలంకృతంబగు నొక గొప్పసభను జేర్చి యాపరిషదమున మాంసభక్షణవిష యకమైన చర్చనొనరించి, "బహువిధజీవవధనిమిత్తం, మధు మద్యమాంసాదికశ్మలాహారనిషేవణం, అశేషదోషప్రకోపనం, అతిపాపహేతుకం, అఖిలవ్యాధ్యుత్పత్తినిమిత్తకం, అతినింద్యం, అభక్ష్యం, అతిదుస్సహం, దుర్గతిహేతుకం దూరాదేవనిరా కృతం" ఇవి మున్నగు గంభీరవాక్యములచే మధుమద్యమాం సాద్యశనమును నిందించిరి. ఈవిషయమును తనగ్రన్థమున "ఖ్యాతశ్శ్రీనృపతుంగవల్లభ మహారాజాధిరాజాస్థితః ప్రోద్య ద్భూరిసభాన్తరే బహువిధప్రఖ్యాతవిద్వజ్జనే, మాంసాశిప్ర రేన్ద్రితాఖిలభిషగ్విద్యావిదామగ్రతః మాంసేనిష్ఫలతాంనిరు ప్యనితరాం జైనేన్ద్రవైద్యస్థితః" అనుశ్లోకముచే సూచించెను.

—కర్ణాటకవైద్యవాఙ్మయము.—

ఈరాజ్యమున సంస్కృతవాఙ్మయముతోబాటు కర్ణా టకభాషయందును వైద్యవాఙ్మయము కొన్నివందల సంవత్సర

ములనుండియు ప్రచారముననున్నట్లులు దెలియుచున్నది. అట్టి గ్రంథములు కొన్ని కర్నాటభాషయందు ఛందోబద్ధములుగను కొన్ని వాక్యరూపములుగను కొన్ని సంస్కృతమునకు టీకలుగను గన్పట్టుచున్నవి.

మంగరాజు :—ఇతడు జైనమతానుయాయి; ఇతడు 1360-ఏ. డి. క్రైస్తవశకముననున్నవాడు. హొయ్సళరాజ్యమునకు జేరిన దేవళిగెయను మండలమున ముగుళియమను పట్టణమునకు ప్రభువుగనుండెను. వీరు స్థావరజంగమాది విషచికిత్సలబోధించు "ఖగేంద్రమణిదర్పణము" అను గొప్పగ్రంథమును కన్నడభాషయందు పద్యాత్మకముగ రచించిరి. ఇందలి స్థావరజంగమ విషచికిత్సలను పూజ్యపాదగ్రన్థమునుండి గ్రహించినటులు వ్రాసియున్నారు. వీరు "కవిజనైకమిత్ర" "సాహిత్యవైద్యవిద్యాజలనిధి" "భిషగ్వరతిలక" ఇవి మున్నగు బిరుదముల నొందియుండిరని తెలియుచున్నది.

అభినవచన్ద్ర:—వీరలు క్రైస్తవ 1400-వ శతాబ్దము నాటివారనియు బ్రాహ్మణులనియు తెలియుచున్నది. వీరు .079-వ క్రైస్తవశకమునాటి మదనతిలకమను గ్రన్థమును రచించిన చంద్రరాజనువారిగ్రన్థముల నుదహరింపుచు సిహ్మదత్తవిరచితమగు నశ్వవైద్యమును హొసగన్నడము (నవీన కర్నాటకభాష) న పద్యరూపముగ రచించెను. ఇయ్యది మిక్కిలి చక్కనిగ్రన్థము.

కం॥ "అనుపమ హయశాస్త్రాగమ।
వననిధియోళ్ సిహ్మాదత్తకృతలక్షణముం।
దినకరతనయాదేవం।
తనమతమం కేళ్వనెగెయె హాసగన్నడదిం"

ఇది మున్నగు కందపద్యములచే పైగ్రన్థము విరచితము.

మరియు జైనమతావలంబియగు దేవేన్ద్రమునికృతమగు బాలగ్రహచికిత్సయను గ్రన్థముకలదు. సాల్వ; చికోపాధ్యాయ, నంజరాజ, నృసిహ్మభట్టప్రభృతు లనేకవైద్యగ్రన్థముల రచియించిరి. చంద్రరాజ రామచంద్రులు మొదలగువారు అశ్వవైద్యమును, చాళుక్యరాజగు కీర్తిమన్తులనువారు గోవైద్యమును, వీరభద్రరాజనువారు పాలకాప్యకృతహస్త్యాయుర్వేదమునకు కార్నాటికటీకను విరచించిరి.

వెండియు వాగ్భటము, చిన్తామణి, వైద్యసారసంగ్రహము, చికిత్సాసారముమున్నగు ననేకగ్రన్థములు 11-12 క్రైస్తవ శతాబ్దముల కాలమునుండియు కర్నాటకభాషయు నలంకరించి యున్నవి. ఇందు కొన్ని శతాబ్దములకుపూర్వము అశ్వవైద్య గజవైద్య గోవైద్యగ్రన్థముల భాషాన్తరమున బరివర్తించుటంజూడ నప్పటికి రాజ్యపాలనమున నశ్వాదిసంరక్షణ మత్యవసరమని దలంచి సౌకర్యమునకై పరివర్తించిరని యూహింపదగియున్నది.

## — ఆంధ్రదేశము ఆయుర్వేదము. —

ఆన్ధ్రదేశమున చరక సుశ్రుత వాగ్భటాదులలో జెప్పిన ప్రయోగములకన్న రసతన్త్రప్రక్రియోపయోగములధికములు.

ఇచ్చటి వైద్యవరులు రసతన్త్రవిహితములగు మహాలక్ష్మీవిలాసరసము, రాజమృగాంకము, మహారాజమృగాంకము, కాన్తవల్లభరసము మొదలగు ననేకౌషధముల నిర్మాణమునందును వానినిచికిత్సల నుపయోగించుట యందును మిక్కిలి సమర్థులు. పారదభస్మమును సర్పవిషమును నిర్భీకముగ నుపయోగించెదరు. ఈదేశమున లంఘనచికిత్సలు మెండు.

## —॥ ఆంధ్రదేశమున సంస్కృత వైద్యవాఙ్మయము. ॥—

వీరి చికిత్సాప్రచారమునకు చిన్తామణి బసవరాజీయము లనుగ్రన్థములు ఆధారములు. అందు చిన్తామణి వల్లభేన్ద్రునిచే విరచితము. ఇతడు నియోగిభూసురుడగు విద్వద్వైద్యుడు. వీరలు 15 లేక 16 క్రైస్తవశతాబ్దములనాటివారని దెలియుచున్నది. ఈగ్రన్థమునం దష్టస్థానపరీక్ష లనుపేరున నాడీమూత్రాది పరీక్షలచే రోగముల దెలియు నుపాయములజెప్పి నిదానలక్షణచికిత్సలంగూడ వివరముగ దెలిపియున్నది. మరియు చరకాది గ్రన్థములకన్న విపులముగ జ్వర భేదములు నిరూపితములు. మరియు పదిమూడు సన్నిపాతభేదములను వానిలో సాధ్యాసాధ్యములను వానిదశావస్థలను విపులముగ జూపియున్నాడు. చికిత్సల దెలుపునప్పుడు రసతన్త్రవిహితములగు రసయోగములను లేహతైలాది యోగములనుగూడ ననేకములుగ జూపియున్నాడు.

బసవరాజీయము:—ఇయ్యది చింతామణికన్న నొక శతాబ్దము వెనుకటి (16 లేక 17 క్రైస్తవశతాబ్దము) కాలమున రచియింపబడినదిగ జెప్పవచ్చును. ఈ గ్రన్థకర్తయగు బసవరాజు ఆన్ధ్రశైవబ్రాహ్మణుడు. ఈయన యనుభవసిద్ధమగు వైద్యమునమిక్కిలి సమర్థుడు. జ్వర సన్నిపాత పైత్య రోగ శ్లేష్మరోగ కాసరోగాది నిదానముల విపులముగను జెప్పియున్నాడు. వానిభేదముల నితరులు వర్ణించి నంతకన్న నధికముగ వివరించెను. నాడీ మూత్రాది పరీక్షలచే రుగ్వినిశ్చయోపాయముల బోధింపుచు చికిత్సాభాగమున తనకు స్వానుభవసిద్ధములగు ననేకౌషధయోగములను మహోదారతతో నిరూపించియున్నాడు. భావమిశ్రులచే గ్రహింపబడిన యహిఫేనము మాచికాయ గసగసాలు కేవలచిన్ని మొదలగు వానినన్నిటిని చికిత్సాయోగముల గ్రహించియున్నాడు. మరియు తన కనుభవసిద్ధములగు యోగములను ఆన్ధ్రపద్యములచే జెప్పియున్నాడు. ఇందు జెప్పబడిన మూలికలన్నియు నాన్ధ్రదేశమున ప్రాయికముగ దొరకునవి. అందు గొడ్డుకాకర, వాలుడు, చెన్నంగి, మదనబుడత, చేతరాసి, సముద్రపాల మున్నగునవి యనేకములు గలవు.

## —( ఆంధ్రవైద్యవాఙ్మయము. )—

మరియు నివ్యోడ చరకము సుశ్రుతము వాగ్భటము మాధవనిదానము భేషజకల్పము రసప్రదీపిక శార్ఙ్గధరసంహిత రసరత్నాకరము పై జెప్పబడిన బసవరాజీయ చింతామణులు

మున్న గు గ్రన్థములకు తెనుగుటీకారూపములును వ్యాఖ్యాన రూపములునునగు గ్రంథములు గన్పట్టుచున్నవి.

—( ఆన్ధ్రపద్యాత్మకములు. )—

అష్టాంగహృదయము, భేషజకల్పము, రసప్రదీపిక, నవనాథసిద్ధదీపిక, ఆన్ధ్రవైద్య చిన్తామణి, శతశ్లోకి, ఆయుర్వేదార్థసంగ్రహము, ధన్వన్తరివిజయము, భిషగ్వరాజ్ఞానము, నృపరాజీయము, దూతాధ్యాయము, మదనకామరత్నము, ఇవి మొదలుగ నెన్నగు ననేకగ్రంథము లాన్ధ్రపద్యరూపములుగ వైద్యవాఙ్మయమును గడచిన మూడు నాలుగు శతాబ్దముల కాలమునుండియు నలంకరించియున్నవి.

—( హైదరాబాదు ఆయుర్వేదము. )—

దక్షిణభారతమునందలి యాంధ్రదేశమునం దొకభాగమైన నైజాంరాష్ట్రము కలదు. ఈరాష్ట్రమునకు హైదరాబాద్ అను ప్రధానరాజధాని కలదని యెల్లరకును విదితము. ఇచ్చోట యవన (యూనానీ) వైద్యముతోబాటు ఆయుర్వేద వైద్యమునకును ప్రాధాన్యము కలదు. ఈ రాజ్యమందలి చికిత్సలు వైదికతాన్త్రికమిశ్రములై యుండును. లంఘనచికిత్సలు మెండు. వమనవిరేచనాది శోధనచికిత్సల ప్రశంసయైనను గన్పడదు. ఇచ్చోట రసతన్త్రబోధితములగు రత్నాది మిశ్రౌషధముల విశేషముగ నుపయోగించెదరు. ఈరాష్ట్రమునందలి ప్రజలును రాజబంధువులును రాజాస్థానమువారును యూనా

నాని ఆయుర్వేద వైద్యముల రెండింటిని విశేషముగ నుపయోగించెదరు.

ఈరాజ్యమున ప్రసిద్ధులైన యాయుర్వేద వైద్యపుంగవులు కొందరు గలరు. అందు లోకాబాబు అనువారు మిగుల ప్రసిద్ధులుగానుండిరి. కవిరాజ హరిగోవిందజీవారు వైద్యశాస్త్రము ననేకులకు బోధించుచు ప్రకృతమున నీరాజధానిలో ఖ్యాతిని వడసియున్నారు.

ఈరాజ్యమున పదునేడు (17) ఆయుర్వేద ధర్మవైద్యశాలలును, ముప్పది (30) యవనవైద్య శాలలును కలవు. మొత్తము ఈ 47 యూనాని ఆయుర్వేద వైద్యశాలలయందు 1195388 గురు రోగులు చికిత్సనొందియున్నారు. ఈధర్మవైద్యశాలల పోషణమునకై దొరతనమువారు ప్రతివత్సరమునను దాదాపు 63781 రూపాయిల ధనమును వ్యయము చేసెదరు.

శ్రీ నైజాముదొరతనమువారు ఆంగ్లవైద్యశాఖయందు 901134 రూపాయీలు వ్యయముచేయుచున్నారు. ఈవ్యయముచే 102 ఆంగ్లవైద్యశాలలు పోషింపబడుచున్నవి. ఇందు 872426 రు రోగులు చికిత్సాసహాయమును బొందియున్నారు. పై వైద్యశాలల సంఖ్యను రోగులసంఖ్యను ద్రవ్యవ్యయము యొక్క మొత్తమును బరికించిన స్వదేశ వైద్య ఆంగ్లేయవైద్యములలో నేదిసులభమైనదియు స్పష్టమగుచున్నది.

పైగనుబరచిన సంఖ్యలమొత్తము నైజాముదొరతనము వారి 1915 నివేదికనుండి దెలియుచున్నది.

శ్రీనైజాముదొరతనమువారు యూనానీవైద్యమును పోషించుటయేగాక ఆయుర్వేదవైద్యమునుగూడ పోషించుచున్నందుకు మనమందరమును వారికి వందనశతముల నర్పింపవలసియున్నది. మరియు స్వదేశవైద్య పోషణమునకై యింతకన్న నధికముగ దోడ్పడవలెనని నైజాముదొరతనమువారిని వినయముతో ప్రార్థించెదను.

—॥ చెన్నరాజధాని - వైద్యవ్యాప్తి. ॥—

చెన్నరాజధానియందు గడచిన కొన్నివత్సరములనుండి వైద్యకలాశాల యొకటియు వైద్యపాఠశాల యొకటియు కలదు. వీనిచే నీప్రాంతమున వైద్యవిద్యాభివృద్ధి కల్గియున్నది. ఇందు నాచే పదునారు (16) వత్సరములుగ నిర్వహింపబడు నాయుర్వేదకలాశాలయందు సంస్కృతశాఖయనియు ఆంధ్రశాఖయనియు రెండుశాఖలు కలవు. ఇందు ఆయుర్వేదముతోబాటు 'అనాటమీ' 'ఫిజియాలజి' మున్నగు నెనిమిది యాంగ్లవైద్యవిషయములును బోధింపబడును. ఇందు చెన్నరాజధానివారలేగాక పంజాబు గుజరాతి సింధు బెంగాల్ మొదలగు దూరదేశమునుండియు విద్యార్థులువచ్చి విద్యనభ్యసించుచున్నారు. ఇందు నిర్ణీతములైన పరీక్షలయందు త్తీర్ణులైనవారలలో కొందరు అమరచింత గద్వాల మొదలగు రాజాస్థానములయందు విద్వద్వైద్యులుగను, కొందరు వైద్యప్రచారకు

లుగను, మరికొందరు వైద్యశాలానిర్వాహకులుగను, కొందరు వైద్యపత్రికాప్రచారకులుగను నున్నారు. ఇందు త్తీర్ణులగువారికి ఆయుర్వేదభూషణ, భిషగ్వర, యను బిరుదము లొసగబడును. ఇచ్చట నాయుర్వేదభూషణ బిరుదమునొందిన యొక కేరళయువకుడు ఆంగ్లద్వీపమునందలి ఎడింబరో పట్టణమున విఖ్యాతమైన విశ్వవిద్యాలయమునందు ఎమ్,ఏ; ఎమ్,బి; సి,హెచ్,బి., అను వైద్యకబిరుద పరీక్షకై నాల్గవవత్సరభాగమును జదువుచున్నాడనిమీకునివేదింప కుతూహలము గల్గియున్నాడను. ఈబాల వైద్యుడు ఆయుర్వేదభూషణపరీక్షలో నియ్యోడగెలుపొంది కలకత్తా నగరమునకేగి యచ్చట హోమియోపతిక్ వైద్యమునను ఆంగ్లవైద్యమునను పట్టభద్రుడై యంతట దృప్తినందక ఎడింబరోనగరమున వైద్యకలాశాలయందు పైజెప్పిన పరీక్షకై చదువుచున్నవాడు. వీడు కొలదిదినములలో పరీక్షయందు కృతార్థతవహించి భారతదేశమునం దాయుర్వేదప్రచారమునకు మిక్కిలి దోడ్పడునటుల మీరందరు నాశీర్వదించవలెనని వేడెద.

మరియు రెండవ ఆయుర్వేదవైద్య పాఠశాల యీ రాజధానియందు కీర్తిశేషులైన హానరబుల్ వి.కృష్ణస్వామిఅయ్యర్ సి. ఐ. ఇ; సి. ఎస్. ఇ; గారిచే నెలకొల్పంబడినది. ఇం దుత్తీర్ణులగువా రీరాజధానియందలి దక్షిణప్రాంతమున విద్వద్వైద్యులుగనున్నారు. కొందరు వైద్యశాలానిర్వాహకులుగ నున్నారు.

పై విద్యాలయములయందు జదువు విద్యార్థులు కర్మపథము నభ్యసించుటకై తదనుబంధముగ ధర్మవైద్యశాలలు గలవు. ఈ రెండు వైద్యశాలలయందును సంవత్సరమునకు 40 (నలువది) వేల రోగులు చికిత్స జేయబడుచున్నారు.

పైరెండుగాక యీమహాపత్తనమున తిరువల్లిక్కేణియందు రావుసాహేబ్ కలవల కణ్ణన్ సెట్టిగారిచే నేర్పరుపబడిన ఆయుర్వేద ధర్మవైద్యశాలయు, జార్జిటౌనులో శ్రీకన్యకాపరమేశ్వరీ ధర్మవైద్యశాలయు, వేపేరియందు చెంగల్వరాయ ధర్మాయుర్వేద వైద్యశాలయు నుంగంబాకమున ధర్మాయుర్వేద వైద్యశాలయు జేరి నాలుగు ధర్మవైద్యశాలలు గలవు. ఇందు తిరువల్లిక్కేణి వైద్యశాలలో ప్రతిదినమున నాల్గువందల(400) నుండి అయిదువందల (500) రోగులు చికిత్స నందుచున్నారు. ఈప్రకార మీ వైద్యశాలయందు సంవత్సరమునకు దాదాపు లక్షయేబదివేల (150000) మంది రోగులు చికిత్సాసహాయమును బొందుచున్నారని దెలుప నానన్దము పొంగుచున్నది. ఇట్టిమొత్తసంఖ్యకల రోగులు రాజకీయమహావైద్యాలయమునకును వచ్చుట లేదని మీకునివేదింప మీకెంత సంతోషముగల్గునో నేనూహింపజాలను. తక్కిన రెండువైద్యశాలలయందు దాదాపుగ సంవత్సరమున కరువదివేల (60000) నుండి డెబ్బదివేల (70000) రోగులవరకు చికిత్సను బడయుచున్నారు.

ఇందు కడపటిదైన నుంగంబాకం ధర్మవైద్యశాల వి ఖ్యాత ధర్మమూర్తులును దానకర్తలునునగు రావుసాహేబు కలవల కణ్ణన్ సెట్టిగారు, మదరాస్ షెరిఫ్ రావుసాహేబు క. రామానుజంసెట్టిగారు వీరిరువరిచే నిన్నటిదినమే స్థాపితమని ఆనరబుల్ జస్టిస్. అబ్దుల్ రహీంసాహేబు బహద్దర్ వారిచే బహి రంగపరుపబడెనని సభానాథులగు శ్రీమన్మహారాజువారికిని సో దరవైద్యబృందమునకును విన్నవింప నుల్లాసముగనున్నది.

—| మండలధర్మవైద్యశాలలు. |—

శ్రీరంగక్షేత్రమున శ్రీప్రసన్నవేంకటేశ్వర ధర్మవైద్య శాలయు నెల్లూరుపురమున రెండు కర్నాటక ధర్మాయుర్వేద వైద్యశాలలును రామేశ్వరమున అచ్చటి దేవాదాయధర్మము లనుండి యేర్పడిన యొకధర్మవైద్యశాలయునుగలసి మొత్తము నకు నాలుగు ధర్మవైద్యశాలలుగలవు. ఈ వైద్యశాలలు ప్రతి సంవత్సరమునను ప్రత్యేకము దాదాపు నలువదివేల (40000) మంది రోగులకు చికిత్సాసాహాయ్య మొనరింపుచున్నవి.

పైగనబరచిన తిరువళిక్కేణి వైద్యాలయమున దా దాపు నాల్గువందల (400) నుండి ఐదువందల (500) రోగు లకు ప్రతిదినంబు నుచితంబుగా చికిత్సజేయుటకును ఇతరవ్య యములను జేర్చి నిర్వహించుటకును మాసమొకటింటికి ఐదు వందలు (500) నుండి యారువందల (600) రూపాయలు ఆవశ్య కములని తెలియుచున్నది. పైజెప్పిన మొత్తముసంఖ్యకల రోగు

లకు చికిత్స జేయదగినంత యాంగ్లవైద్యాలయమును అన్నివిధములగు వ్యయములతో పరిపాలింపవలెనన్నచో పైజెప్పిన మొత్తము ఒకప్రధానచికిత్సకుని మాసవేతనమునకై నజాలదు. ఇంక సహాయవైద్యులకును ఔషధములకును పరికరములకును ఎంతద్రవ్యము కావలసియుండునో మహాజనుల కెల్లరకును గోచరము కాగలదు.

## —॥ రాజకీయాంగ్లవైద్యసహాయము. ॥—

ఆర్యవైద్యసోదరులారా! ఇంతదనుక చెన్నరాజధానియందు ఆయుర్వేద వైద్యప్రచారముంగూర్చి విన్నవించితిని. ఇంక దొరతనమువారి యాంగ్లవైద్యసహాయమునుగురించి ముచ్చటించెదను. ఆంగ్లవైద్య సహాయమునకై మన దొరతనమువారు వత్సరమునకు దాదాపు ముప్పది (30) లక్షల రూప్యములను వెచ్చించుచున్నారు. ఈరాష్ట్రమునందంతటను జేరి దాదాపున ఆరువందల తొంబైయేడు(697) యాంగ్ల చికిత్సాలయములు గలవు. ఈచికిత్సాలయములు దాదాపుగ నెనిమిదివందల (800) చికిత్సకులచే నిర్వహింపబడుచున్నవి. దొరతనమువారి కొలువునగల చికిత్సకులుగాక ఉద్యోగములనుండి విరామమునొందినవారును స్వతంత్రవైద్యులుగ నున్నవారును జేరి దాదాపుగ రెండువందల (200) యాంగ్లవైద్య చికిత్సకులు కలరనుకొందుము. మొత్తమున నాంగ్లచికిత్సకులు వెయ్యి (1000) మంది మాత్రమే చెన్నరాజ్యమున కలరని తెలి

యుచున్నది. ఈ రాష్ట్రమునం దంతటను నాల్గుకోట్లు ఇరువదిలక్షల (42000000) ప్రజలున్నారు. పైజెప్పిన వైద్యసంఖ్యను జనసంఖ్యకు పంచిపెట్టగా నలువదిరెండువేల (42000) జనులకు ఒక యాంగ్లచికిత్సకుడు చికిత్సాసాహాయ్య మొనరించుచున్నటుల దెలియుచున్నది. దీనికై దొరతనమువారు వత్సరమున కెన్నిరూప్యముల వెచ్చించుచున్నారో యోజింపుడు. మరియు పైవివర్శనమునుబట్టి యాంగ్లవైద్యసహాయము బొందదలచిన యొకనికి దాదాపు 7 ఏడు అణాలును, ఆయుర్వేద చికిత్సాసహాయము నొందదలచిన యొకనికి దాదాపు ఎనిమిది పైసలును ఖర్చుఅగుచున్నట్లు తెలియుచున్నది. దీనిని బరికించిన మనయాయుర్వేద వైద్యసహాయమెంత సులభమైనదియు ఎంత స్వల్పద్రవ్యసహాయసాధ్యమైనదియు మహాజనులకెల్ల విశదము కాగలదు. పైగనుపరపబడిన సంఖ్యలు దొరతనమువారి 1915-వ వత్సరపు నివేదికనుండి తెలియుచున్నవి.

భారతదేశమునందంతటను ప్రతివత్సరమును దాదాపు ముప్పదియేడు(37)మిలియన్సు మూడుకోట్లు ముప్పదియేడులక్షలు (33700000) ఔట్ డోర్ పేషంట్సు (ఔషధశాలకువచ్చి యౌషధముల గైకొను రోగులు) చికిత్సాసహాయమును బొందుచున్నారు. అందు మదరాసు రాజ్యమునమాత్రము ఏడు మిలియన్సు అనగా డెబ్బదిలక్షలు (7000000) రోగులు చికిత్సాసహాయమును బొందినారు. మొత్తమున ఔట్ డోర్ పేషంట్సు

హిందూదేశమున తక్కిన భాగములకన్న చెన్నరాజ్యమున నెక్కువమంది చికిత్స నొందియున్నారని భారత సామ్రాజ్యము వారి1913 సంవత్సరపు నివేదికనుండి తెలియుచున్నది. దీనిని బరికించినచో మా చెన్నరాజ్యమునందలి ప్రజలకుగలదేశభక్తియు దేశీయ వైద్యమునంగల ప్రీతియు సారాసార వివేచకదక్షులగు సభాసదులకెల్ల విశదముకాగలదు. మరియు ఆయుర్వేదవైద్యము ఈ దక్షిణాపథమున నెంతగ వెనుకబడియున్నదియు తమకు విదితముకాగలదు.

—॥ ఆయుర్వేదము, రాజకీయసహాయము. ॥—

ఈ రాజ్యమునం దాయుర్వేదవైద్యమునకుగూడ దొరతనమువారి సహాయము మునిసిపల్ సంఘములనుండి లభించుచున్నదని చెప్పుటకు సంతోషముగ నున్నదిగాని అట్టిసహాయద్రవ్యముయొక్క పరిమితి యారువంద (600) లనిమాత్రము తమరికి జెప్పినచో నీమహాసంతోష సమయమున తమకందరకును మనస్సున భ్రాంతియు విస్మయంబును కలుగకమానదు.

దొరతనమువారిచే నాయుర్వేదవైద్యమునకై యొసంగబడు ద్రవ్య మణుమాత్రమైనను మనప్రియమైన దొరతనమువారిచే నంగీకృతమైనదగుటంజేసి దానినిమహామేరువుగ దలచి శిరసావహించి గ్రహించుచున్నారము.

దొరతనమువారు కొన్నివత్సరములుగ కరుణించియిచ్చు నాయల్పద్రవ్యమునకై యనేకములగు నంతరాయములు

కలుగుచున్నవి. రాజకీయవైద్యకశాసన పక్షపాతులగువారు ఆయుర్వేదవైద్యశాలల పోషణమునకు రాజకీయ ధర్మనిధుల నుండియు మునిసిపల్ సంఘపు ధర్మనిధులనుండియు నేర్పడిన ధర్మద్రవ్యములచే నేమాత్రమైన సహాయము జేయదగదని శాసనమునం గనపరచిరి; కాని ప్రజాపక్షపాతులగు మన ప్రియపరిపాలకులు దాని నిరాకరించి యాసాహాయ్యమును గూడ నొనరించుచునే యున్నారు. అయినను ప్రతివత్సరము నను ఆయవ్యయ విమర్శకసభయందు ఆయుర్వేద వైద్యశాల లకై జేయబడు నీయణుమాత్ర సహాయముకూడ కూడదని మూలచ్ఛేదనమునకే ప్రతిపక్షులు ప్రయత్నించుచుందురు కాని యింతవరకును భగవంతుడగు ధన్వన్తరియొక్క ప్రభావబలము నం జేసి వారియుద్యమములు కొనసాగజాలకున్నయవి. ఇక మున్నెట్లు కాగల్గనున్నదో తెలియజాలను.

## —॥ దక్షిణభారతము, ఆయుర్వేదవైద్యవాఙ్మయము. ॥—

ఇంతవరకును దక్షిణభారతమున నాయాభాగముల యందు చిరకాలమునుండియు నభివృద్ధింగాంచిన యాయుర్వేద వైద్యమును వివరింపుచు ప్రస్తావానుసారముగ నచ్చటచ్చట ప్రచారముననుండు వైద్యవాఙ్మయమునుగూడ సూచించితిని. ఇంక దక్షిణభారత సామాన్యమునంగల యాయుర్వేద వాఙ్మ యమునుగూర్చి సవిమర్శముగ వివరించెద.

## —॥ సంహితలు. ॥—

చరకము సుశ్రుతము వాగ్భటము మున్నగు వైదికగ్రన్థ ములకును, రసరత్నాకరము రసరత్న సముచ్చయము మొద

లగు తాన్త్రికగ్రన్థములకును ఉత్తరభారతమున ప్రచారము గల్గియున్నట్లులు ఈదక్షిణభారతమునగూడ ప్రచారముగలదు. ఇవిగాక ఉత్తరభారతమున ప్రచారమున లేనివియు మిక్కిలి ప్రాచీనములునునగు భేడసంహిత కాశ్యపసంహితలు ఇప్పటికిని తంజావూరు సరస్వతీపుస్తక భాండాగారమునమాత్రము కలవనునది యీదక్షిణాపథమునకు గౌరవాతిశయమును గల్గించుచున్నది. వీరిమతములనుండు చికిత్సాప్రచారముకూడ నీభాగమున నధికముగ నున్నయది. మరియు క్షారపాణిసంహిత జాతూకర్ణసంహితలును గలవు. నేనీగ్రన్థములకై మిక్కిలి ప్రయత్నము జేయుచున్నాడను. నాప్రయత్నము త్వరలో సఫలంబగునని తలచెదను. మరియు భారద్వాజసంహితయు ఆత్రేయసంహితయు గలవు. ఇందలి కల్పస్థానమునకు జేరిన భేషజకల్పభాగములు లభ్యములు. వీనికి గొన్నిప్రాచీనములగు వ్యాఖ్యలును గలవు. విపులపరిభాషాబోధకములగు నిట్టిగ్రంథములు ఉత్తరభారతమున దుర్లభములనుటకు గడచిన యేబదివత్సరములకు పూర్వము శ్రీగంగాధరకవిరాజ విరచితమగు వైద్యకపరిభాషయే నిదర్శనము.

## —॥ సూత్రగ్రన్థములు. ॥—

సూత్రరూపములగు గొన్నిగ్రంథములు కలవు. అందు ఆయుర్వేదసూత్రము లనునది పదునేడు (17) ప్రశ్నముల గూడియున్నది. ఈగ్రన్థమును పరిశీలించిచూడ నింక కొంతభాగము

న్నట్లు తోచుచున్నది. దీనికి అయిదధ్యాయములవరకు నిత్యానందసనాథవిరచితమగు వ్యాఖ్య లభ్యముగనున్నది. ఇయ్యది పూర్ణముగ దొరకుటలేదు. మరియు నీసూత్రములకు నగస్త్య విరచితభాష్యముకూడ కలదని ప్రతీతిమాత్రము కలదు. అయ్యది నాకు లభింపకుండుటంజేసి దానింగూర్చి విమర్శింపజాలను. ఇట్టి సూత్రాత్మకములగు గ్రన్థములలో రుఘ్ హృదయము, రుగ్విలాసము, రుఘ్ హృదయసారము మొదలగునవియు కొన్ని గలవు. సంపూర్ణమగువానియానుపూర్వి నాకు దొరకకున్నది. మరియు వీనిరచనాకాలమును గ్రంథకర్తలనామములును దెలియుట దుర్ఘటముగనున్నయది. ప్రియవైద్యసోదర్యులకు సూత్రనైఖరి వినిపించుటకై రెండు మూడు సూత్రముల జెప్పెద.— "అథాతో ధాతుస్థదోషగత్యవికారద్రవ్యాణ్యాద్యాత్, 'ఆమంహిసర్వరోగాణామ్, 'అనామపాలనంకార్యమ్" ఇవి మున్నగు సూత్రరూపములుగ పైగ్రన్థము లున్నవి. ఇట్టి సూత్రరూప గ్రన్థములు దక్షిణభారతమునదప్ప నితరభాగమున వెదకినను ఇంతదనుక గన్పించకున్నయవి

## —॥ వ్యాఖ్యలు. ॥—

చరకసుశ్రుతములకు వ్యాఖ్యారచన యీదేశమున నున్నట్లు తెలియలేదు. వాగ్భటము సింధుదేశమున జనించినదైనను దానికి కేరళమున ప్రచార మధికముగనున్నది. దీనికి ముద్రితములగు అరుణదత్త హేమాద్రివిరచిత వ్యాఖ్యలుగాక

విజ్ఞానేశ్వరమును, గంగాధర మాధవ విరచిత వ్యాఖ్యలును, హృదయప్రియయను వ్యాఖ్యయును జేరి నాల్గువ్యాఖ్యానము లీదక్షిణాపథమున విరచితములు లభ్యములు. అష్టాఙ్గసఙ్గ్రహమునకును "ఇందు టీక" యను చక్కని వ్యాఖ్యానమునుకలదు. మరియు వాగ్భటునకు సారవిద్యాధర విఠల పణ్డితవిరచితములగు ఖండనమండనగ్రన్థములు రెండుగలవు.

—॥ రసతన్త్రములు. ॥—

రసతన్త్రమునకు జేరిన సారస్వతముగూడ నీప్రాన్తమునననేకగ్రంథరూపముల దాల్చియున్నది. అందు కొన్నిటిని దమకు సవిమర్శముగ నివేదించెద.

ఆనన్దకన్దము, లేక రసానన్దకన్దము:—ఇయ్యది త్రయోదశభైరవులలో జేరిన మన్థానభైరవునిచే విరచితము.

శివతత్త్వరత్నాకరము:—ఇయ్యది కేరళబసవరాజ విరచితము. ఇందు రసతన్త్రమునగల విభాగములన్నియు గలవు. సిద్ధములైనయౌషధముల బరీక్షించునుపాయములు విశేషముగ గలవు. ఇట్టి పరీక్షావిధానములజూపిన మహనీయులలో నితడే మొదటివాడై యుండునాయనియు దోచుచున్నది. "బృహతీకుసుమాకారం లఘు వారితరం గురు । ఘర్షణే రక్తవర్ణం స్యాత్ తన్మృగాఙ్కస్య లక్షణమ్ । అతసీపుష్పసఙ్కాశః భూపతిర్లఘుమానకః॥" ఇవి మున్నగు శ్లోకములచే ఘర్షణా

తోలన తాపన ఛేదన స్పర్శన దర్శనాదులచే బరీక్షించుక్రమ మును నిరూపించియున్నాడు.

రసప్రదీపిక:—ఇయ్యది జగన్నాథసూరిపుత్రుడగు మంగళగిరిసూరివిరచితము. వ్యాఖ్యానసహితము. ఇవిగాక రససిద్ధాన్తానుశాసనము రససిద్ధిమున్నగు రసతన్త్రబోధకములగు గ్రన్థములు కొన్ని ప్రసిద్ధములుగ నున్నవి.

—॥ సంగ్రహగ్రన్థములు. ॥—

ప్రసిద్ధములగు ననేకగ్రన్థములనుండి యనేకవిషయముల సంగ్రహించి కూర్పబడిన గ్రన్థములు కొన్నిగలవు

అందు పరహితసంహిత:—ఇయ్యది శ్రీనాథపణ్డితవిరచితము. ఇందు శల్యశాలాక్యాద్యష్టాఙ్గములు విపులముగ వివరింపబడియున్నవి. మరియు కౌమారభృత్యమును ప్రధానముగజేసి తొలుతవివరించి హేతులక్షణచికిత్సల మూడిటిని విపులముగ నిరూపించియున్నది. ఇయ్యది యష్టాంగబోధక గ్రన్థములలో నుత్తమమైనది.

బృహద్యోగతరంగిణి:—ఇయ్యది త్రిమల్ల విరచితము. ఇతడు తెనుగునియోగిభూసురుడు. కృష్ణామండలమునందలి కొండపల్లియనుగ్రామము వీరిజన్మస్థానము. ఇయ్యది స్వతంత్ర విరచితమగు చక్కని చికిత్సాగ్రన్థము.

యోగతరఙ్గిణి:—ఇయ్యది సింగనభట్టపౌత్రుడును వల్లభభట్టపుత్రుడునునగు త్రిమల్లభట్టునిచే విరచితము. ఇతడు ఆన్ధ్రబ్రాహ్మణుడు. 1731 ఎ. డి. క్రైస్తవశక కాలమునాటివాని

తెలియుచున్నది. ఇందును పైగ్రన్థముసవలెనే చక్కని చికిత్సా యోగములుగలవు.

యోగరత్నావళి :—పరమశైవాచార్య శ్రీకంఠ పండిత విరచితము. వీరలు ఆంధ్రశైవబ్రాహ్మణులు. 1790 న క్రైస్తవ శకమునాటివారు. ఇందు చక్కని చికిత్సాయోగములుగలవు.

హితోపదేశము:—శ్రీకణ్ఠశివపండితవిరచితము. వీరును ఆన్ధ్రశైవబ్రాహ్మణులు. ఇందలి చికిత్సలు మిక్కిలి యాదరణీయములు.

ఇవిగాక భేషజసర్వస్వము, ధన్వన్తరివిలాసము, యోగశతకము, ధన్వన్తరిసారనిధి, సన్నిపాతచన్ద్రిక, రాజమృగాఙ్కము, ప్రశ్నోత్తరరత్నమాల, వీరభట్టీయము, గదాసఞ్జీవని, ఉమామహేశ్వరసంవాదము, చిన్తామణి, బసవరాజీయము, ఇవి మున్నగు ననేకగ్రన్థములు చికిత్సాదుల మిక్కిలి కొనియాడదగినవి కలవు.

## —॥ నాడీగ్రన్థములు. ॥—

నాడీవిజ్ఞాననిర్ణయము, షడ్విధనాడీతన్త్రము, నాడీనక్షత్రమాల, నాడీజ్ఞానము, మొదలగు గ్రన్థములు నాడీపరిజ్ఞానబోధకములు కలవు.

## —॥ నిదానగ్రన్థములు. ॥—

శ్రీకణ్ఠనిదానము :—ఇది శ్రీకణ్ఠపణ్డితవిరచితము. దీనికి జ్వరత్రిశతామృతమనియు పేరుకలదు. ఇయ్యది మాధవనిదానము

వంటిది. ఇందు తొలుత అష్టస్థానపరీక్షలచే రోగపరిజ్ఞానమార్గములదెలిపి పిమ్మట నాయారోగముల నిదానలక్షణాదులను వివరముగ నిరూపించియున్నది. జ్వరసన్నిపాతాది నిదానములను మాధవనిదానమునకన్న విపులముగ దెలిపియున్నాడు. సకలరోగ పరిజ్ఞానోపాయము లిందధికములుగ గలవు. దీనికి బంగారయ్య అను నియోగిబ్రాహ్మణుడు తెనుగున చక్కని వ్యాఖ్య రచించియున్నాడు. దక్షిణదేశమున నియ్యది ప్రసిద్ధమగు నిదానగ్రన్థము దీనియందు దాక్షిణాత్యులకు నిరుపమానమైన ప్రీతి కలదు.

నిదానప్రదీపము:—ఇయ్యది నాగనాథ విరచితము. ఇవిమున్నగు నిదానగ్రన్థములు కొన్ని ప్రసిద్ధములుగ కలవు.

—॥ నిఘంటుగ్రన్థములు. ॥—

కార్మణము:—దీనిని రచియించినవారి పేరు తెలియ సాధ్యముగాకున్నది. అయినను ఇందలి విషయములనుబట్టి యాన్ధ్రదేశపు వైద్యవరునిచే రచియింపబడినదియని యూహింపదగియున్నది. ఇయ్యది పదార్థగుణములబోధించుటలో సత్యోత్తమముగనున్నది. ఇందు ప్రతిపదార్థముయొక్కయు పంచాఙ్గముల (ఆకులు పువ్వులు కాయలు చెక్క వేరు) ననుసరించి గుణముల వేర్వేరుగ జెప్పియున్నాడు. ఆన్ధ్రదేశమున ప్రసిద్ధములగు మూలికలగూడచేర్చి విశేషముగ జెప్పియున్నాడు.

అభిధానరత్నమాల:—దీనికి షడ్రసనిఘంటు వనియు పేరుకలదు. ఇందు మధురాదిరసములభేదములను బట్టి పదార్థ

విభాగమును జేసియున్నాడు. దీనికి చక్కని సంస్కృతవ్యాఖ్య కలదు. మరియు ద్రవ్యగుణ రత్నావళి, ద్రవ్యగుణ కల్పవల్లి, ఆయుర్వేదమహోదధి (శ్రీశుకవిరచితము), పదార్థచన్ద్రిక, అభిధాన చూడామణి, ద్రవ్యగుణ శతశ్లోకి, అష్టాఙ్గహృదయ నిఘంటువు మున్నగు గ్రన్థములు మిక్కిలి ప్రసిద్ధిజెందియున్నవి. ఈ గ్రన్థములయందు ఈ దేశమున విశేషముగ నలవాటులో నున్న "కుండలి" మున్నగు ననేకద్రవ్యముల నిరూపించియున్నాడు.

## —( * శ్రీవీరచోళ ఆతురాలయశాసనము. )—

(1062—1067—A. D.)

విద్వద్వైద్యబృందమా! ఇంతవరకును దక్షిణభారతమునందాయుర్వేదప్రచారమును వాఙ్మయము చికిత్సవిద్య మున్నగువానివ్యాప్తిచే తమకు నివేదించినాడ. దక్షిణాపథమున నాయుర్వేదాభివృద్ధిని కోరిన కొందరు ప్రాచీనరాజవరులు ఆయుర్వేదమునకు సంబంధించిన కొన్నినిబంధనల నెలకొల్పి అట్టియేర్పాటుజేయబడిన ధర్మములు నిరపాయముగ చిరకాలము జరుగుటకై కొన్నిశాసనముల నేర్పరచిరి. అందు నాయుపన్యాసమునకు సంబంధించిన కొన్నివిషయముల సూక్ష్మముగ దెలిపి యుపన్యాసమును పూర్తిగావించెద.

దక్షిణభారతమున ప్రకృతము నాకు లభ్యములై ప్రసిద్ధములుగనుండుఆయుర్వేదవైద్య సంబంధిశాసనములలో చెంగల్

* దీనివివరములను మాచే వ్రాయబడిన ఆయుర్వేదీయశాసనములు అను పుస్తకమున జూడనగును.

పట్టుజిల్లా మధురాంతకము తాలూకాలో జేరిన తిరుమకూడల్ గ్రామమున శ్రీవీరచోళమహారాజుచే నెలకొల్పబడిన శాసనము మొదటిదియైయున్నది. ఈశాసనము చోళదేశాధిపతియగు రాజకేసరి వీరరాజేన్ద్రదేవు అనుప్రభువుచే తనకు పట్టాభిషేకమైనపిదప నైదువత్సరములకు పిమ్మట (1067) వ క్రైస్తవ శకవత్సరమున తా జేసిన ధర్మనిబంధనలు శాశ్వతములుగ జరుగుటకై యేర్పరుపబడినది. ఇయ్యది పైజెప్పిన గ్రామమునంగల శ్రీవేంకటేశ్వర దేవాలయము గర్భగృహముయొక్క గోడలలోనుండు రాతిబండలపై వ్రాయబడినది. ఈశాసనమున శ్రీవేంకటేశ్వరులకు నిత్యోత్సవాది కైంకర్యములకును వేదశాస్త్రముల బోధించు నొకపాఠశాలకును పాఠములజెప్పునుపాధ్యాయులకును పోషణమునకై కావలసిన నిబంధనముల వ్రాసి తదనుబంధముగ నచ్చట జదువు విద్యార్థుల యారోగ్య సంరక్షణమునకై యుత్తమమగు నొక యాతురాలయమును జరుపుచుండవలెనని వ్రాయబడియున్నది. అట్టి యాతురాలయమునుగూర్చి పై శాసనమున నియమించిన పద్ధతులనిట సంగ్రహముగ జూపెదను.—

“ఈయాతురాలయము “శ్రీవీరచోళాతురాలయము” అనుపేర ప్రసిద్ధినొంది యుండవలెను. ఇందు పదునైదుగురు రోగులు నివసించియుండుటకు కావలసినవసతిని కల్పింపనగును. ఇందు ఒకకాయచికిత్సకుడును, ఒకశల్యచికిత్సకుడును, ఇద్దఱ

పరిచారకపురుషులును, ఇద్దరు పరిచారకస్త్రీలును, ఒకసేవక పురుషుడును, ఒకద్వారపాలకుడును ఉండవలయును. వీరు వారివారికి దగినపనుల జేయుచుండవలెను" అని వ్రాసి పైజె ప్పినవారి కియ్యదగిన వేతనము వారుచేయవలసిన కృత్య ములు మొదలగు నిబంధనల దెలుపుపట్టికయు నిట్లు వ్రాయ బడియున్నది.

కాయచికిత్సకుడు—పరంపరాగతమైన వైద్యబాధ్యతగల వాడును ఆలపాకనివాసియు సవర్ణగోత్రోద్భవుడునైన "కోదండ రామాశ్వత్థామభట్టర్" అనువారు కాయచికిత్సకుడుగ నియ మింపబడెను. వీరికి ప్రతిదినంబును మూడుకురిణీలువడ్లును ఎని మిదికాసులు రొక్కంబును వేతనముగ నియమింపబడినది.

శల్యచికిత్సకుడు :—వీరి నామధేయము నుదహరించక ఏకవచనమున "శల్యక్రియైపణ్ణువాన్" అని వ్రాసియున్నది. వీరికి దినమొకటింటికి నొకకురిణివడ్లుమాత్రము వేతనము నియ మింపబడినది.

పరిచారకులు :—మందులకు కావలసిన మూలికలు మొదలగు ద్రవ్యముల దెచ్చుటకును తైలాదుల పక్వము జేయు టకు కావలసిన కట్టెలు మున్నగువాని దెచ్చుటకును మందుల జేయుటకును సమర్థులగు పరిచారకు లిరువురుండవలెను. వీరికి ప్రత్యేకము దినమొకటికి ఒకకురుణివడ్లును ఒకకాసు రొక్క మును వేతనము.

ప్రత్యేకపరిచారకుడు:—రోగులకు సామాన్యోపచారములజేయుటకు ప్రత్యేకముగ నొకపరిచారకుడు నియమింపబడెను. వీని కొక నాడిపరిమితమగు ధాన్యము వేతనము.

స్త్రీపరిచారికలు :—వీరు రోగులకు నియమితకాలమున మందులనిచ్చి పథ్యముల యథోచితముగజూచుచు నాహారాదులనిచ్చి తత్తత్కాలోచితములగు నుపచారముల సలుపుచుండవలెను. వీరి కిరువురకును జేరి ప్రతిదినంబును నాల్గునాడులు వడ్లును ఒకకాసు రొక్కంబును నియమింపబడినది.

చాకలి, కుమ్మరి:—రోగులబట్టల నుతుకుటకు చాకలియొకడును, ఆతురాలయమున కావశ్యకములగు కుండలనిచ్చుటకై యొకకుమ్మరివాడును నియమింపబడిరి.

ద్వారపాలకుడు :—వాకిట కావలివాడొకడు కలడు. వీనికి ప్రతిదినము నాల్గునాడులు వడ్లును ఒకకాసును నియమింపబడినది.

మరియు రోగులయుపయోగమునకై యేడుచాపలును, రాత్రులయందు దీపము వెలుగుటకై సత్సరమునకు నలువదియైదు (45) నాడుల పరిమితమగు తైలంబును నిర్ణయింపబడినది.

మరియు నీయాతురాలయమున చికిత్సకై సిద్ధపరచియుంచబడిన బ్రాహ్మరసాయనము, వాశాహరీతకి, దశమూలహరీతకి, ఉత్తమకర్ణ్యాదితైలము, బలాకోరండకాదితైలము, లశునాద్యేరండతైలము, బిల్వాదిఘృతము, మండూరవటిక,

ద్రవవర్తి, సునేత్రావర్తి, కల్యాణలవణము మున్నగు నిరువది యొకఔషధములపట్టికయు వానిపరిమితిభేదంబులును నీశాసనమున వ్రాయబడియున్నవి. ఇందలివిషయములనెల్ల విశదముగ వివరింప నవకాశము చాలదుగాన నింతట విరమించెదను.

ఈ శాసనము చెన్నపురీ రాజకీయప్రాచీన వస్తుపరిశోధక సహాయశాఖాధికారియు నాప్రియమిత్రులునునగు రావుసాహెబ్ హెచ్. కృష్ణశాస్త్రిలు బి. ఏ., గారిచే జి. ఓ. నెంబర్. 99-29 ఆగస్టు 1916 - దినమున ప్రచురించిన గౌర్నమెంటు హోం డిపార్టుమెంటు నివేదికయందు సవిస్తరముగవివరింపబడియున్నది. అట్టి శాసనమును ఆయుర్వేదవిషయముల గూర్చి విమర్శించుటకై నాకొసగిరి. నాచే విమర్శింపబడిన వివరము రాగల రాజకీయనివేదికయందు ముద్రింపబడును.

— మలకాపురశాసనము. —

గుంటూరు మండలమునందలి గుంటూరుతాలూకాలో చేరిన మంగళగిరికి ఆరుమైళ్లదూరమునంగల మలకాపురమను గ్రామమున నొకశిలాశాసనముకలదు. ఇయ్యది పదునొకండవ (11) వ క్రైస్తవశతాబ్దమునకు మధ్యకాలమున కాకతీయ వంశజుడగు గణపతిదేవుని కాలమున జేయబడిన దానధర్మముల నిర్ణయమును దెలుపుటకై యేర్పరుపబడినది. ఈశాసనమునందు ఆగ్రామమున ప్రతివారికిని విద్యార్థులకును విద్యాలయములకును పోషణముకొఱకు ప్రత్యేకమున నియ్యబడిన

భూములవివరము వ్రాయబడియున్నది. మరియు నిందు "ప్రసూత్యారోగ్యశాలాభ్యాం" "పఞ్చవ్యాఖ్యాకృతోవైద్యః" "ప్రత్యేకంపుట్టికాద్వయమ్" ఇవి మున్నగు వాక్యములచేత ప్రసూత్యారోగ్యశాలలను పోషించుటకును వైద్యుని పోషణమునకును ప్రత్యేకముగ రెండేసిపుట్ల (రెండుపుట్ల విత్తనములచల్లి పైరుచేయదగినంత విస్తీర్ణముగల (40)నలువది యెకరముల) భూమిని యిచ్చినట్లు చెప్పబడినది. ఇయ్యది అస్మత్ప్రియమిత్రులును ఆంధ్రసాహిత్య పరిషత్సభాపతియునగు శ్రీజయంతి రామయ్యపంతులుగారు బి.యే. బి.యెల్., వారిచేనాకు లభించినది. ఇయ్యది ప్రకృతము దొరతనమువారి ప్రాచీన వస్తుపరిశోధక శాఖాలయమున (Epigraphy Office) శ్రీకృష్ణశాస్త్రి గారిచే విమర్శింపబడుచున్నది. దీని కాలమునుగూర్చి యింకయు విమర్శింపబడుచున్నది.

## —( నందలూరుశాసనము. )—

ఈ పేరుగల శాసనము కడపజిల్లాలో నందలూరుగ్రామమునంగల సౌమ్యనాథస్వామి దేవాలయమున ప్రాకారపు రాళ్ళమీద చెక్కబడియున్నది. ఇనుబోలు గ్రామవాసులగు వెలుమలు సాంక్రామిక వ్యాధులలో జేరిన మహామారీజ్వరమను క్రూరవ్యాధిచే భీతులై పెరుంగండూరను గ్రామమున గుడిసెలవేసుకొని యుండిరని యీశాసనముచే దెలియుచున్నది. ఇయ్యది చోళరాజులలో జేరిన కులోత్తుంగచోళునికాలమున

(1191-వ క్రైస్తవశకవత్సరమున) నేర్పరుపంబడినది. దీని వివరమంతయు దొరతనమువారి 1908 వత్సరపు ప్రాచీనవస్తు పరిశోధకశాఖవారి నివేదికయందు 84-85 పేజీలలో గానవగును. దీనినుండి ప్లేగుజ్వరము చిరకాలమునుండి యీదేశమున కలదనియు దానిబాధకై యారోగ్యరక్షణ మవసరమనియు "హితం జనపదానాం చ శివానాముపసేవనమ్" అను చరకోక్తిప్రకారము ఆరోగ్యసంరక్షణమునకై యట్టిప్రదేశములవదలి యారోగ్యప్రదేశముల నుండిరనియు దెలియుచున్నది.

## — అక్కలపూడిశాసనము. —

గోదావరిజిల్లాలోచేరిన రాజమహేన్ద్రవరమునకు సమీపమునందుండు కొరుకొండకు రాజుగానుండిన శ్రీరాజా ముమ్మడినాయకులు 1290-వ శాలీవాహనశకమునకు సరియగు 1368-వ క్రైస్తవాబ్దమున వారియాస్థానమున విద్వద్వైద్యుడును మన్త్రిసమానుడును కాళనాథభట్టవంశజుడుననగు వైద్యవరునకు అక్కలపూడియను గ్రామమును దానమొసంగినట్లు ఒకశాసనముకలదు. ఈ శాసనము ప్రకృతము దొరతనమువారిచే ఏపిగ్రాఫియా ఇండికాయందు ముద్రింపంబడుచున్నది.

## — కలవచేరుశాసనము. —

1345 శకాబ్దమునకు సరియైన 1423 క్రైస్తవశకవత్సరమున కాళనాథభట్ట పుత్రుడగు పరహితాచార్యులను వైద్యునకు గోదావరిజిల్లాలోచేరిన అన్నవరమను నామాన్తరముకల

కలవచేరు గ్రామమును దత్తముచేసి లిఖించిన తామ్రశాసన మొకటికలదు. ఈవైద్యవరుడు పై యక్కలపూడి శాసనము సంజెప్పిన పరహితాచార్యులకు మూడవతరమువాడని తెలియుచున్నది. ఈవంశమునకు జేరిన మూలపురుషులలో నొకడొక సమయమున నొకసర్పము దవడలరెండిటిసంధియందు ఎముక గ్రుచ్చుకొని బాధపడుచుండుటంజూచి యామెముక నూడబెరికి పుండునుమాన్పి యాసర్పమునకు హితమునుజేసెను. దానంజేసి నాటనుండియు వానికి పరహితుడనునన్వర్థముగ నామము కలిగి యాసర్పమువలన నభయమొంది చికిత్సజేయుందొడంగ నాటంగోలె యాతనివంశమున సర్పచికిత్స వాడుకలోనుండెననియు ఇవిమున్నగు విషయములు పై శాసనముచే దెలియుచున్నవి. మరియు పై రెండుశాసనములయందును గనుపరుపబడిన పరహిత పరంపరాగత వైద్యులు సర్వతన్త్రస్వతన్త్రులనియు వైద్యవిద్యానిపుణులనియు సర్పచికిత్సకులనియు పై శాసనమున బోధించియున్నది. ఈ పరంపరలోజేరిన యాంధ్రదేశవైద్యశిఖామణులు వైద్యవాఙ్మయమును రచించినదియు లేనిదియు నీశాసనముచేదెలియ సాధ్యముగాకున్నది. ఈశాసన వివరమంతయు శ్రీజయంతి రామయ్యపంతులుగారిచే నాన్ధ్ర సాహిత్యపరిషత్పత్రికయందు వివరింపబడినది. దీనివలన నాన్ధ్రదేశమున విద్వద్వైద్యులు పెక్కండ్రు కలరనియు విషచికిత్సకులును సర్పచికిత్సకులును ఆకాలమున నుండిరనియు దెలియుచున్నది.

12/40

పైశాసనముల నన్నిటిని పరిశీలించుటచే నస్మద్దేశీయులగు రాజులు చిరకాలమునుండియు ఆతురాలయములను, ప్రసూతిశాలా వైద్యశాలలను నియమించి దానినిర్వహింపం దగిన వైద్యులనియోజించి అయ్యవి శాశ్వతముగ నడచుటకై తగిన మూలధనమును గ్రామాదులను స్థిరముగనేర్పరిచి యాయుర్వేదమును నానాట వృద్ధినొందింపుచు జనుల కారోగ్యపరిరక్షణ మొనరించుచుండిరనియు స్ఫుటముగ దెలియుచున్నది.

ఆర్యులారా! పూర్వకాలమున మనప్రాచీను లిట్టియనేకధర్మముల నొనరించియున్నారు. వాని నాయాప్రాంతములనుండు జ్ఞానవంతులు మిక్కిలిశ్రద్ధతో వెదకుచు కనిపెట్టి ప్రచురపరుపవలెను. దొరతనమువారిచే నేర్పాటుచేయబడిన ప్రాచీనవస్త్వన్వేషణ పరిశోధక శాఖవారికి దొరకినచో వారు మిక్కిలి యుత్సాహముతో బరిశీలించెదరు. వీరిసాహాయ్యమున మన ప్రాచీనవైద్యవిద్యా వైభవము వెల్లడికాగలదు. అందలి విషయము లిక్కాలపువారికి మార్గదాయకములును కాగలవు.

### —) ప్రకృతమున కర్తవ్యాంశములు. )—

సోదరవైద్యబృందమా!

ఇంతదనుక దక్షిణభారతమునందలి యాయుర్వేదప్రచారముంగూర్చి నాకు దెలిసినకొలది తమకు దెలిపితిని. ఇంక

కర్తవ్యాంశములంగూర్చి యొండు రెండుమాటలజెప్పి నాయుప న్యాసమును ముగించెదను.

కొలదికాలమునుండియు నీ యాయుర్వేదమహామండలి భారతవర్షమున నాయుర్వేదప్రచారముంగూర్చి చేయుకార్య జాతమంతయు నందరకును విదితమే. మరియు నియ్యది సేతు హిమాచలమధ్యవర్తియగు భారతదేశమునంగల దేశీయవై ద్యులనెల్ల నొక్కెడజేర్చి యందరికిని ఐకమత్యమును కలుగ జేసి యాయుర్వేదమున నపూర్వమగు నుత్సాహమును గల్గించు చున్నది. దీనిచే ప్రతివత్సరమునను మనమందరమునొక్కెడజేరి యనేకములగు నాయుర్వేదీయవిషయములజర్చించి చిరంతనం బగు నాయుర్వేదముయొక్క పునోభివృద్ధికిం దగుప్రయత్నముల జేయ మనంబుల సంకల్పించుచున్నారము. మనలో గొందరు దీని యభివృద్ధికై పాటుపడుచునేయున్నారు. దీనియందభిమానము గలవారు ఆమోదించుచున్నారు. దేశబాంధవులగు హానరబిల్ అసదల్లీఖాన్, హానరబిల్ ఏ. ఎస్., కృష్ణరావుపంతులు, సరబిల్ సి. వై. చిన్తామణి, హానరబిల్ పండిత మదన మాళవ్య మున్నగు దేశబాంధవులు రాజస్థానమున నికిప్రాముఖ్యము గల్గునట్లు ప్రయత్నముల సలుపుచున్నారు. అఖిలభారత రాజకీయ వైద్యశాఖాధికారులగు సర్, ఫార్డీ, లూకీస్ గారు అమృతవాక్యముల దీని కభయదాన మొసగి యున్నారు. సార్వభౌమ ప్రతినిధిగనుండిన లార్డు హార్డింజి

ప్రభువరులు డిల్లీ మహాపురమునజరిగిన తిబియాయుర్వేదకలాశాల శంకుస్థాపన మహోత్సవసమయమున తమకీయాయుర్వేదవిద్య యందుగల యభినివేశమును వెల్లడిజేసిరి. మనపరిపాలకులగు సార్వభౌములు విద్వద్వైద్యవరులకు భావగర్భితంబును అన్వర్థంబునునగు 'వైద్యరత్న' యను బిరుదమొసంగి వారికీవిద్య యందుకల యాదరమును దెలుపుచు నీయాయుర్వేదమును తమ యాస్థానవైద్యముగ గ్రహించిరి.

ఇట్టి యుత్సాహసమయమున నార్షసంతతిలోజేరిన మన మందరును ఐకమత్యమున మహర్షుల జ్ఞానతేజస్సుతోగూడిన యష్టాంగాయుర్వేదవైద్యము నింతకన్న నభివృద్ధినందించుటకై వారివారిశక్తికి వంచనజేయక తగినప్రయత్నముల సంపూర్ణముగ జేయుట సహజధర్మము.

మనదేశమునకును మనయాచారములకును మనప్రకృతులకును మిక్కిలి యనుకూలములై మనకు సరియగు శీతోష్ణస్థితులుగల మనభారతదేశమున మనతోబాటు జనించిన యౌషధులను శాస్త్రీయపద్ధతుల నతిక్రమించక యౌషధరూపము నందించి మనదేశమునంగల గ్రామము లన్నిటియందును చికిత్సోపయోగము జేసి మనచికిత్సావిధానమును దేశమునందంతటను వ్యాపింపజేయ దగుప్రయత్నముల జేయుట మనకు విధియైయున్నది.

వైద్యసోదరులారా! మన యావచ్ఛక్తిని వినియోగపరచి దేశీయవైద్యమును వృద్ధినొందించుట మనకు ముఖ్యకృత్యము. మనమాయుర్వేదమునకై చేయుప్రయత్నములలో మనల నితరు లాశ్రయించునటుల జేయవలెనుగాని మన మితరుల నాశ్రయించునట్లుండగూడదు.

లోకోక్తిననుసరించి మనమందరు గూడియున్న యీ మూడుదినముల పండుగను మనమున మరువక వారువారును తమతమశక్తికి లోపము జేయక "నహిజీవితదానాద్ధి దానమన్యద్విశిష్యతే" అనుచరకోక్తి మనంబున స్మరింపుచు సర్వజనసామాన్యముగ స్వస్థతనుగల్పింప మీకందరకును సూచించెద.

న్యాయదీక్షాధురంధరుడగు మన శ్రీ శ్రీ శ్రీ జార్జి సార్వభౌమునకు ఘోరంబగు నీసంగ్రామమున త్వరలో నన్నివిధముల జయము గల్గుటకై శ్రీమద్ధన్వన్తరి ననేకవిధముల ప్రార్థించుచు నుపన్యాసమునుండి విరమించుచున్నాడను.

"భిషజాం సాధువృత్తానాం భద్రమాగమశాలినామ్।
అభ్యస్తకర్మణాం భద్రం భద్రం భద్రాభిలాషిణామ్"॥

ఇతి సర్వం శివమ్.

శ్రీసుదర్శనస్వరయేనమః.

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలయందు

శ్రీమాన్, వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు,

ఎ. వి. ఎస్., ఎ. ఎం. బి. వారిచే సంప్రదాయానుసారముగ

వ్రాయబడి ముద్రితములై క్రయమునకు సిద్ధముగనున్న

# ఆయుర్వేద వైద్యగ్రంథములు.

* శాశ్వత చందాదారులకు మా మాధవనిదానముతప్ప మిగత పుస్తకములు 100-కి 25-రూ. తగ్గించి ఇవ్వబడును.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | మాధవనిదానము - సంస్కృతము. విపులాంధ్రవ్యాఖ్యాయుతము. రోగనిదానాదు లందెలుపు గొప్పవైద్యగ్రంథము. వెల ... ... | 3 | 0 | 0 |
| 2. | పథ్యాపథ్యము - సంస్కృతము. విశదముగు తెనుగుతాత్పర్యము వ్రాయబడినది. ప్రతిరోగమునకును హితాహితములగు పథ్యాపథ్యములను తెలుపును. వెల ... | 1 | 0 | 0 |
| 3. | ఆయుర్వేదపరిభాష - అనేకగొప్ప ఆయుర్వేద గ్రంథములనుండి సంగ్రహింపబడినది. సంస్కృతమునకు చక్కని తెనుగుటీక. ఆయుర్వేదౌషధముల జేయువారు ముఖ్యముగ నెరుగవలసిన విషయము లనేకము లిందుగలవు. వెల ... | 1 | 8 | 0 |
| 4. | అగస్త్యవైద్యము - దక్షిణదేశపు వైద్యసంప్రదాయములను బోధించు తెనుగు వచనము. వెల ... ... ... | 0 | 4 | 0 |
| 5. | ఆయుర్వేదాంగశల్యతంత్రము - ఆయుర్వేదమున శస్త్రచికిత్స నున్ను కనుగొనిన దియు దానినభ్యసించు మార్గములను బోధించు తెనుగువచనము. వెల ... | 0 | 4 | 0 |
| 6. | వస్తికర్మము - "పిచికారి" యొక్క స్వరూపమును దానినుపయోగించు విధమును అందుపయోగింపబడు చికిత్సామార్గములును వ్రాయబడియుండు తెనుగు వచనము. వెల ... ... ... ... | 0 | 4 | 0 |
| 7. | అర్కప్రకాశము - ప్రతిమూలికనుండియు "అరఖుల" దీయుట కుపాయము లను వానిచే రోగములను కుదుర్చు మార్గములను ఆయుర్వేదపద్ధతి ననుసరించి తెలుపు గొప్పచికిత్సా గ్రంథము. సంస్కృతమునకు విస్తృతమైన యాంధ్ర వ్యాఖ్యానము వ్రాయబడి యున్నది. వెల ... ... | 2 | 0 | 0 |

* ఇంతవరకు ముద్రితములును నికమీద ముద్రింపంబోవు గ్రంథముల నన్నిటిని గ్రహించువారు శాశ్వతచందాదారులుగ నెన్నబడుదురు.